కృష్ణశాస్త్రి

# అప్పుడు పుట్టి ఉంటే



ఓరియంట్ లాఙ్మన్

ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్

రిజిస్టర్డ్ కార్యాలయం
3-6-272, హిమాయత్ నగర్
హైదరాబాద్ 500 029 (ఆం.ప్ర.)

ఇతర కార్యాలయాలు
కామాని మార్గ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 400 038
17 చిత్తరంజన్ అవెన్యూ, కలకత్తా 700 072
160 అన్నాసలాయి, మద్రాసు 600 002
1/24 ఆసఫ్ ఆలీ రోడ్డు, కొత్తఢిల్లీ 110 002
80/1 మహాత్మాగాంధీ రోడ్డు, బెంగుళూరు 560 001
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029
బిర్లా మందిర్ రోడ్డు, పాట్నా 800 004
పాటియాలా హౌజ్, 16-ఎ, అశోక్ మార్గ్, లక్నో 226 001
ఎస్.సి. గోస్వామి రోడ్డు, పాన్ బజార్, గౌహతి 781 001



ISBN 0 86125 943 2

ప్రచురణ
ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

టైప్ సెట్
మాస్టర్ గ్రాఫిక్స్, లక్డీకాపూల్, హైద్రాబాద్ 500 004.

ముద్రణ
స్పీడ్ ప్రింట్, సైదాబాద్, హైద్రాబాద్ 500 004

# రెండు మాటలు

శ్రీ కృష్ణశాస్త్రి వంటి ఆరియుతేరిన (రచనా) వృద్ధ మూర్తుల రచనా సంపుటాలకు ముందు ఏవో రెండు మాటలు వ్రాయబోవడం చాపల్యంవల్ల గాని, చాతుర్యంవల్ల గాదు. అయితే ఈ ప్రయత్నం ఎందుకు? అంటే – ఆయన రచనల మీద ఉండే తెగ ఇష్టం వల్ల, అని జవాబు.

ఒకసారి శ్రీ కృష్ణరాయభాషానిలయంలో జరిగిన మహాసభకు హాజరయి, శ్రీ శాస్త్రిగారి కారులో తిరిగివస్తూ ఆయనతో అన్నాను. – "అన్నగారూ, మీ రచనలన్నీ – రేడియో నాటికలు – ప్రసంగాలతో సహా త్వరగా అచ్చయి ఎప్పుడు వస్తాయా అని ఎదురుచూస్తున్నాం. మిమ్మల్ని 'కృష్ణపక్షం', 'ఊర్వశీప్రవాసం'– కవిగానే లోకం చాలా వరకు ఎరుగును. మీ అద్భుతమైన వివిధసారస్వత ప్రక్రియలను ఒడుపైన వచనరచనలను లోకానికి చూపి చకితం చెయ్యాలి" అని ఊరుకోక, 'పోనీ కొన్నిరచనలు నాకివ్వండి – నేను చక్కగా వేస్తాను.' అన్నాను.

శాస్త్రిగారు స్తిమితంగా – 'అన్నీ సిద్ధం చేశాను. త్వరగానే అచ్చవుతాయి. చూడండి' అన్నారు.

అని, సుమారు మూడేళ్ళయింది.

పుస్తకాలు అచ్చుకాలేదు.

అయితే – శాస్త్రిగారి కాలమానంలో మూడేళ్ళంటే మూడు రోజులన్నమాట.

తర్వాత మళ్ళా కలుసుకోలేదు. తదుపరి చాలా మార్పులు వచ్చాయి.

శాస్త్రిగారు దైవికంగా మౌని అయిపోవడం, ఆయన ఆరోగ్యం ఎన్నాళ్ళకోగాని కుదురుపడకపోవడం వగైరా–

మొన్న ఆ మధ్య కులుసుకున్నప్పుడు ఆయన బల్లమీద "బహుకాలదర్శనం" అనే రచనల సంపుటి హఠాత్తుగా కనపడేటప్పటికి, నా సంతోషానికి మేర లేకపోయింది.

ఆయన ఆ సంపుటానికి ఏ ఇతర కారణాలవల్ల ఆ పేరు పెట్టినా, వాటికోసం ఎదురుచూచే అస్మదాదులయెడల ఆ పేరు అన్వర్థం అయింది.

"బహుకాల దర్శనం" లో - ఒక ఆప్తత ఉంది. ఆపేక్ష ఉంది. ఆశ ఉంది.

బహుకాలానికి అయిన ఆ "దర్శనం" మళ్ళా అదృశ్యం కాకుండా మా విశ్వోదయ ధృఢసంకల్పంతో శాస్త్రిగారి రచనా సంపుటాలను పరంపరగా ప్రకటించడానికి పూనుకోవడం, ఏనాడో అస్మదాదుల కళ్ళల్లో మెదలిన స్వప్నానికి సుస్థిరరూపం ఇవ్వడమై, మరింత ఉల్లాసాన్ని కలిగిస్తున్నది.

ఇక్కడ ఒక ప్రశ్న —

ఏమి ? —

శాస్త్రిగారి పుస్తకాల ప్రచురణకు ఎందుకంత తహతహ ?

తెలుగుదేశం, రచయితలకు, కవులకు, గొడ్డు పోయిందా?

చేయివిసిరితే, వందమంది.!

పుస్తకాలకు కరువా?

విఫణివీధిలో వేలకువేలు.

మరి ? —

అక్కడే ఉంది విశేషం. ఈ ప్రశ్నకు సరైన జవాబుచెబితే- శాస్త్రిగారి రచనాసారాన్ని స్పృశించినట్టే !

శాస్త్రిగారికీ, ఆంధ్రలోకానికీ ఉండే అనుబంధం విచిత్రమైనది.

మొదట శాస్త్రిగారికి లోకం ఎంత ఇష్టమో, అంత అందకుండా దూరంగా ఉండేవారు.

లోకానికి లోపల ఆయన మీద ఎంత అనురాగమో అంత విముఖంగా ఉన్నట్టు కనబడేది. క్రమంగా రెండు దశాబ్దులు కడచేటప్పటికి శాస్త్రిగారు తమ లోకాతీత కవితా గంధర్వలోకంనుంచి ప్రజల్లోకి తొంగిచూడడం ప్రారంభించారు. జనత తలయెత్తి ఆయనవైపు ఆశగా చూచింది. లోకంలోని ఎత్తులూ, పల్లాలు, విసుగులు, విలాసాలు,

వలపులు, వగవులు, అందాలు, అహంకారాలు, ఆయన్ను ఎలుగెత్తి పిలిచాయి.

అన్నింటికీ ఆయన మారుపలికారు. ఆ పలుకులో నుంచి సూటిగా సూనృతంగా గేయాలు పరుగులెత్తాయి. ప్రసంగాలు పరిమళించాయి. యక్షగానాలు ప్రత్యక్షమైనాయి. విజ్ఞానం వినోదం సహస్రముఖాల విచ్చుకున్నాయి.

వీటిని ప్రజలకు అందించడానికి అభ్రభారతి (Radio) చేసిన సహాయం మరువరానిది.

ఇట్టి విశిష్టరచయిత రచనలను ఏకముఖంగా చేతిలో పెట్టుకుని చదివి ఆనందించకుండా సాహిత్యప్రియులు ఉపేక్ష వహించలేరు. అంతేకాదు –

ఆ రచనల సంస్కారం అనన్యాదృశమైనది. లోకంలోని కొందరు రచయితలు పురాణవిశ్వాసాలకో, నవీన వ్యామోహాలకో తాకట్టుపడి ఒకటి పురస్కరించడం వేరొకటి తిరస్కరించడం పరిపాటి.

శాస్త్రిగారు ప్రాచీన నవీన ప్రగతి వాదాల త్రివేణీ సంగమం. ఇందులో ఏ ఒక్కటీ నిర్గుణమైనదిగాని, నిర్దుష్టమైనది గాని కాదని ఆయన తలంపు. ప్రతిభావంతుడు అన్నిటినీ చూస్తాడు. తనమార్గమేదో తాను నిశ్చయించుకుంటాడు. ఒకరి వెంటపడడం, ఒకరికి ప్రతిధ్వనిగా మారడం అతనికి కిట్టని సంగతి. ఈ సత్యాన్నే కాళిదాసు మాళవికలో అన్నాడు – "సంతః పరీక్ష్య అన్యతర ద్భజంతే మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః"

చిన్ననాడు మహాకవులు పండితులు అయిన తండ్రి పెదతండ్రుల సాహచర్యం,

విద్యార్థిదశలో ఆంగ్లభాషా సాహిత్య కోవిదుడు రఘుపతి – నాయుడుగారి ఆచార్యకం, బాగా ఎదిగినపిమ్మట రామమోహనరాయల వంటి మానవతావాదుల అపార ప్రభావం, ఆయనను క్రొత్తవ్యక్తిని చేశాయి. కనుకనే ఆయన సాహిత్యంగురించి మాట్లాడినా, సామ్యవాదం గురించి మాట్లాడినా ఉమర్ ఖయ్యాము గూర్చి మాట్లాడినా, ఉపనిషత్తులు గూర్చి మాట్లాడినా, ఒక విలక్షణ వాక్కు ఖంగున మ్రోగుతుంది.

ఒకకొందరికి వలె ఆయన రచనకు లోకంలో అస్పృశ్యము లంటూ ఏవీ లేవు, 'శక్తి అంటూ ఉండాలిగాని, రచయితకు ఉదారం, నీచం అనీ, రమ్యం జుగుప్సిత మనీ, ఏదీ లేదు. అన్నీ ప్రతిభాపింఛికతో స్పృశిస్తే మనోహరం అయిపోతాయి.' అని ఆయన మతమూ, అనుభవమూను.

కనుకనే ఆయన 'పుష్పలావికలు' గురించి ఎంత శ్రద్ధగా చెప్పగలరో, 'బూట్ పాలిష్' గురించికూడా అంత ఇంపుగాను చెప్పగలరు. శ్రీనాథుని కవితారహస్యాలలోకి చొచ్చుకుపోయి చూచినట్టే, చిన్నారిపాపల ఆటలపాటల్లో కూడా లీనమై పోగలరు. కాబట్టి, ఆయన నోటివెంట ఏది వచ్చినా ఎవరో ప్రేరణచేస్తే వచ్చినట్టుకాక, హృదయంనుంచి దూసుకు వచ్చినట్టు కనపడుతుంది.

ఇంకో విశేష మేమంటే,

కొందరు రచయితలు ఏదో ఒక రచనాప్రక్రియను అవలంబించి, కృతార్థు లవుతారు. మరి కొందరు కొన్నిటిని అభిమానించి, మరికొన్నిటిని ప్రయోగాత్మకంగా వ్రాస్తారు. అవి సఫలం కావచ్చు. విఫలం కావచ్చు. నమ్మకం లేదు.

శాస్త్రిగారి విషయంలో మొదట అట్లాగే అనుకున్నాం; ఆయన దుర్గం కవిత మాత్రమే అనీ, ఇంకేదీ ఆయన వల్లకాదనీ, కాని – ఆయన కవితను మించిన వచనమూ, యక్షగానాలూ, నాటికలూ వ్రాసి, లోకాన్ని దిగ్భ్రాంతం చేశారు. కథ, నవల జోలికి పోలేదు. ఆయన రుచే వాటి మీదకు ప్రసరించ లేదేమో.

ఉత్తమ రచయితకు ప్రతిభ, వ్యుత్పత్తి సమృద్ధిగా ఉండాలంటారు. కాని, శాస్త్రిగారికి వ్యుత్పత్తికంటె ప్రతిభమీదనే పక్షపాతం. అట్లా అని – ఆయన వ్యుత్పత్తిని తిరస్కరించిన సన్నివేశాలు చెప్పదగినంతగా కనపడవు. లోకంలో లబ్ధప్రతిష్ఠులైన కవుల కంటె ఆయన వాడిన అపశబ్దాలు తక్కువే.

ఏతావాతా —

ఆధునికాంధ్ర సాహిత్యంలో అసాధారణ ప్రతిభావంతుడైన రచయిత శ్రీ కృష్ణశాస్త్రి. అట్టివారి రచనలు లోకానికి త్వరగా సమగ్రంగా

అందాలి. ఆ ప్రయత్నంలో సంకీర్ణ వ్యాసాలు, సాహిత్య ప్రసంగాలు, యక్షగానాలు, శ్రవ్య నాటికలు, గేయాలు, ఖండ కావ్యాలు, క్రమంగా ప్రకటితం కావడం ఆంధ్ర సాహిత్యప్రియులకు ఎంతైనా హర్షదాయకమనుకుంటాను. ఈ విశ్వోదయ ప్రయత్నానికి ప్రజామోదం ఉంటుందని నా విశ్వాసం.

కావలికళాశాల
1-10-65

ఇట్లు
ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

కృష్ణశాస్త్రి
కృతులు

"ఏకాంత సేవ"

పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము

అప్పుడు పుట్టి ఉంటే

బసవరాజు అప్పారావు మధురస్మృతి

అన్నమాచారి

# “ ఏకాంత సేవ ”

## (1922)

తిరుగ నీ నాఁటి కాంధ్ర సారస్వతమునకు వసంతోదయమైనది; నవజీవము కలిగినది; నూతన రామణీయకము చేకూరినది. వల్లరుల కొక కొత్త సౌకుమార్యము, చివురుల కొక క్రొత్త మెత్తందనము, ప్రసవముల కొక క్రొత్త కమ్మందనము, మకరందమునకొక క్రొత్త మాధుర్యము, కలకంఠమునకొక క్రొత్త కంఠస్వరము – ఈ వసంతము వనలక్ష్మికొక క్రొత్త శోభ, ఒక వింత సౌందర్యము – ఒక యపూర్వ లావణ్యము !!! ఆంధ్ర సారస్వత చరిత్రములో నొక నూతన శకము ప్రారంభమైనది. కవులు బయలుదేరినారు; ప్రాఁతకవులవంటి వారు గారు; గాన మొనర్చుచున్నారు; వెనుకటి వారి వలెఁ గాదు. విషయములో మార్పు; రీతిలో మార్పు, స్వరములో మార్పు; ఔను. కాలము మారినపుడు, కాలముతోఁ బరిస్థితులన్నియు మారినపుడు, కవిత్వము మాత్రము మారకుండునా?

ప్రాచ్య పాశ్చాత్య నాగరికతా సమ్మేళనము వలన మనవారు క్రొత్తవారైనారు. వీరికిఁ గొన్ని నూతనాశయము లలవడినవి. వీరిలోఁ గొన్ని విచిత్రలక్షణములు కనుపట్టుచున్నవి. కవులలోఁ గొందఱంతే;

ఆంధ్రకవులలోఁగూడ నంతే. వీరు పాశ్చాత్య సారస్వతపఠనము చేయనక్కఱలేదు; చేయకున్నను మారి పోవుచున్నారు; మారిపోవుచున్నట్టు తెలియఁగకయే మారిపోవుచున్నారు; మారిపోవుట తప్పక మారిపోవు చున్నారు; వాతావరణముతో మారిపోవుచున్నారు. ఎట్లు?

నవ్యకవులకు స్వేచ్ఛ ప్రాణము. వీరు ప్రాణమైనఁ గోల్పోవుదురుకాని శృంఖలముల ధరింపరు. వీరికిఁ బ్రాణము కన్న గానము తీపు – సంకెలలో సంగీతమా! కట్టుఁబాటులోఁ గవిత్వమా?

మఱియొక చిత్రము. వీరొకరికై కవనము చెప్పరు. వీరికీ యశ మక్కఱలేదు; ధనధాన్యములపైఁ గోర్కిలేదు; ఇతరు లానందింతురా యను నాతురతలేదు. వీరు గానము చేయుదురు. ఏలయన గానము చేయవలయుఁగనుక చేయుదురు. పాడుట వీరి కూపిరి పీల్చుట, విడుచుట – ఏల పాడుదురో వీరే యెఱుఁగరు. చందమామ యేల చంద్రికల వెదచల్లును? పూవులేల తావుల విరఁజిమ్మును? నీర మేల పారును? తెమ్మెర లేల విసరును? కోయిల యేల గొంతెత్తి పాడును? పరులఁ దనియించుటకా? తన బాగునకా? పాడకున్న బ్రతుకు గడవకా?

వీరు ప్రకృతికి బిడ్డలు. ఆమె యొడిలో నిద్రింతురు; ఆమెకడ మాటలాడ నేర్తురు; ఆమెతో మాటలాడనేర్తురు; ఆమె స్తన్యముఁ గ్రోలుదురు; ఆమెతో నాటలాడుకొందురు; ఆమెను గౌఁగిలింతురు. ఆమె చిఱునవ్వే వీరికీ వెన్నెల. ఆమె పలుకులే వీరికి గోయిల కూఁతలు. ఆమె వదనమే వీరికిఁ జంద్రమండలము. ఆమె చూపులే వీరికిఁ జుక్కలు. ఆమెయే వీరి సర్వస్వము. ఆమె పాడును; గర్జించును; ఆమె నవ్వును; బొమముడివేయును. ఆమె కౌఁగిలించును; దండించును. ఎట్లైన నామెను వీరు విడువరు. వారిదములు, భూరుహములు, పులుఁగులు పువ్వులు, మధుపములు, మారుతములు, నక్షత్రములు, నదులు వీరికిఁగూరిమి నెచ్చెలులు; ప్రాణబంధువులు.

మఱియు వీరు ప్రకృతిని సులోచనములతోఁజూడరు. కనులతోఁ గాంచుదురు; వీరు ప్రకృతికి దూరముగాఁ దొలఁగిపోరు; చెంతఁ జేరుదురు వీరి ప్రకృతి పుస్తకములలోని ప్రకృతి కాదు; వీరు ప్రతినిముషముఁజూచి ప్రేమించు ప్రకృతియే.

కనుక వీరికి విశ్వమునఁ బ్రేమింపఁదగనిది, గౌరవింపఁదగనిది; వర్ణింపఁదగనిది యెయ్యదియు లేదు.ఘనాఘన గర్జనము కప్పకూఁత; కలకంఠరుతము, కాకి యఱుపు, కంజాతము, గడ్డిపోఁచ; మృగరాజను, మూషికము అన్నియు వీరికి సమానములే. అన్నిటిలో వీరు సౌందర్య మరయుదురు. అరసి యానందింతురు. ఆనందించి గానము చేయుదురు; "సుందరమగు వస్తువే సంతతానంద దాయక" మని (A thing of beauty is a joy for ever-keats)గంతు లిడుదురు. షేక్స్పియర్ అన్నట్లు వీరికిఁ బాదపములు భాషణములు; సెలయేళ్ళు పుస్తకములు; శిలలు ధర్మోపన్యాసములు. వర్డ్సువర్తను కవి వాక్రుచ్చినరీతి నెట్టి చిన్న పూవైనను వీరి హృదయముల గంభీర భావములను బుట్టించి కన్నీరుఁ గురియింపఁ జేయును.

*To me the meanest flower that blows can give*

*Thoughts that do often lie too deep for tears.*

మఱియు వీరికి సార్వభౌముని గాథవలెనే సామాన్యుని కథకూడా వర్ణనీయము. నిరుపేద నిట్టూర్పు, కలుషాత్ముని కన్నీరు, చిన్ని పాప చిఱునవ్వు, కన్నతల్లి కంటి చూపు, కాపుకన్నె కలికిపలుపు– ఇయ్యవికూడా వీరికిఁ బ్రబంధము రచియింపఁదగు విషయములే; ఒక్కొక్కదానిపై నొక్కొక్క కావ్యము విరచింతురు.

ఇట్టి వీరికవిత్వమునకుఁ బ్రధానలక్షణము లెవ్వి? భావనా శక్తి (Imagination) బుద్ధిసూక్ష్మతకాదు; దానికంటె ఘన తరము భావనాశక్తి. ఇది కనఁబడని వస్తువులఁ గాంచఁగలదు. వినఁబడనిధ్వనుల వినఁగలదు. పోవలేని ప్రదేశములకుఁ బోఁగలదు. దీని స్వచ్ఛంద

విహారమున కీ విశాల విశ్వము చాలదు. ఒకసారి తారకాకాంతలతోఁదాండవ మాడించును; ఒకసారి మున్నీటితరఁగలలోఁ ముంచివేయును; ఇఁక నొక్కసారి పవనునితో బరువులెత్తించును. మఱియొక్కసారి వారిదములపైఁ బ్రయాణము చేయించును; ఇపుడు సుమములతో సౌరభములఁ గురియించును; ఇపుడు మధుపములతో మకరందముఁ ద్రావించును; సెలయేటిలో గల గల మనిపించును; పులుఁగులతో గలకలపాడించును; బిచ్చగానితోఁ దిరిప మెత్తించును; రాజాధిరాజుతో సింహాసనారూఢుఁ జేయును. పాపాత్మునితో భాష్పములఁ బ్రవహింప జేయును; భక్తునితో బ్రహ్మ సాయుజ్యము నొందించును. స్వరములో నేమున్నదో,సంచారములో నేమున్నదో, శిరఃకంపములో నేమున్నదో, చిఱునవ్వులో నేమున్నదో, హస్తచాలనములో నేమున్నదో,యపాంగ వీక్షణములో నేమున్నదో, యియ్యదియే కవికిఁ దెలియఁబఱచును. మనస్సులో మనస్సును జూపించును. హృదయములో హృదయమును వ్యక్త పఱచును. మబ్బు, గాలి, పక్షి, తుమ్మెద మున్నగునవి దీని జాతిలోనివే. దీనికిఁ గాలముతోఁ బనిలేదు. స్థానముతోఁ బనిలేదు. వయసుతోఁ బనిలేదు. వస్తు తారతమ్యముతోఁ బనిలేదు."బురదలో బొరలు కీటకముకూడా నీశ్వరసేవఁ దలయెత్తుచున్నది" అని షెల్లీ చాటించినాఁడు.

*The Worm beneath the sod*

*May lift in homage of the God*

రవీంద్రనాథుఁడు చాటినట్లు కాటికిఁ గాలుచాచిన కవి సర్వసమవయస్కుఁడే.

*All have need for me; and I have no time to brood over the after-life. I am of an age with each, what matter if my hair turns gray.*

భావనా శక్తియే కవిని నూతన పథముల విచిత్రగతుల నడిపించును. అందువలననే యొక మహాకవి వెఱ్ఱివానినిఁ, బ్రియునిఁ, గవినిఁ గలిపి ముడిపెట్టినాఁడు.

*The lunatic, the lover, and the poet*

*Are of imagination all Compact.*

వీరు గాలిలో మేడలఁ గట్టుదురు; ఆకృతులఁ గల్పింతురు. ఆయాకృతులకు నామకరణమొనర్తురు; నివాస స్థలము నిర్మింతురు. బ్లేక్కవిను వెఱ్ఱివాఁడని లోకము నిరసింపలేదా!

కాని యీ కవుల భావనాశక్తి వెఱ్ఱివాని వికృత కల్పనా సామర్థ్యము కన్న మిన్న. మఱియు నున్నత హర్మ్యముల వర్ణించుచు, "నక్షత్రములు సౌధగవాక్షముల లోనికి దూరి యచటి పిల్లలకు నాటవస్తువులైన" వనుట వికృతకల్పన. "ప్రద్యుమ్నుఁడు చిలుకచేఁ బ్రియురాలక సందేశముఁ బంపె" ననుట భావనాశక్తి. మొదటిదానిలో గొప్ప లేదు. రెండవది కవిత్వమున కుండవలసిన ముఖ్య లక్షణములలో నొకటి.

ఈ భావనాశక్తి ప్రతిమానవునికి గలదు. అట్టిచో నందఱును గవులౌదురా? కారు. దీనితో నితరపరికరములు కావలయును. సౌరభము లెగఁ జిమ్ముటకు సమీరము కావలయును. తళతళ ద్యుతుల మెఱయుటకు వజ్రమునకు సానఱాయి కావలయును.

తన్మయీ భవనయోగ్యత, భావోద్రేకము(Emotion) దీనికిఁ దోడు గావలయును. కవి నొక విధమగు నుద్రేక మూగింపవలెను; ఒక యావేశ మావహింపవలెను. "దుఃఖమో, మోదమో, కోపమో, వలపో, యీర్ష్యయో-భక్తియో, యతనిని మార్చివేయవలెను. అతనిచే నతనినే మఱపింపఁ జేయవలెను. అట్టిసమయమున నతఁడు వలవల నేడ్చును. పకపక నవ్వును; పిచ్చికేక లిడును; పాడును; నృత్యము చేయును.

"బాజాలురా నాన్న బాజాలు,
బాజాలురా నాన్న బాజాలు,
బాజాలతో వచ్చె పల్లకీ అదుగో,
పల్లకీలో ఉంది పార్వతీదేవి,
పార్వతీదేవికీ జేజేలు పెట్టు.
బాజాలురా నాన్న బాజాలు.
బాజాలు వచ్చాయి బాజాలు"

అని గంతులిడు చిన్నబిడ్డ కొంతవఱకుఁ గవి యగుచున్నాఁడు.

"ఎందుకైతే వుంచినావో బందిఖానాలో"

అని మొఱపెట్టు రామదాసు కొంతవఱకుఁ గవి యగుచున్నాఁడు.

"జుట్టులో పువ్వులూ పెట్టుకున్నావా,
ముత్యాలజూకాలు పెట్టుకున్నావా,
గజ్జెల్ల మొలతాడు కట్టుకొన్నావా,
వచ్చి ముద్దియ్యవే వరహాలతల్లీ"

అని వాత్సల్య పరవశయై పాడుతల్లి కొంతవఱకుఁ కవి యగుచున్నది.

కంటికీ కాటుకెట్టి, కడవ చంకనుబెట్టి
కన్నీరు కడవ నిండెనుగదరా, చల్ మోహనరంగా,
నీకు నాకు జోడు అయితే, మల్లెపూల తెప్పగట్టి,
తెప్పమీద తేలిపోదాం గదరా చల్ మోహనరంగా,

అని గాన మొనర్చు ప్రణయ స్వరూపిణియగు పల్లె పడుచు కొంతవఱకుఁ గవయిత్రి యగుచున్నది.

"జీరంగి నీలయేణి! నిలిసి మాట్లాడవే
నిలిసి మాట్లాడవే, కలిసి ముద్దులియ్యవే.
పలకనైన పలకవే! పంచదార చిలకవే"

అని తన ప్రేమోద్దేశము వెలువఱచు శబరకుమారుఁడు కొంతవఱకుఁ గవి యగుచున్నాఁడు.

"రెండు కాళ్ళూ లేవు నారాయణా,
రెండు కళ్ళూ లేవు నారాయణా,
కట్ట గుడ్డాలేదు నారాయణా,
నిలువ నీడాలేదు నారాయణా"
కుడువ కూడూ లేదు నారయణా,

అని దైన్యముగా విలపించు భిక్షుకుఁడు కవివలె దుఃఖ తన్మయత్వము నొందుటలేదా? కవిత్వమునకుఁ గావలసినది భావనాస్ఫోరకత్వము,(**Suggestiveness**) హృదయాకర్షణము, రసోజ్జృంభణము.

కాని ఇట్టి పాటలకు సారస్వత చరిత్రములో శాశ్వత స్థానము, గౌరవస్థానములేదు. ఏలయన – వీనిని బుస్తకమునఁ జదివినప్పుడొక విలక్షణమగు గానము వెలువడదు, పాడి నప్పుడే యివి బాగుగ నుండును. వీనిలో నొకకొఱఁత గలదు. చక్కని పదములు లేవు; కూర్పులేదు; కవిత్వమునకు ఛందోబద్ధమగు మనోహరశబ్ద సముదాయముకూడఁ గావలయును.

కాని కేవలము గణయతి ప్రాసనియమములు నిరర్థకములు; అస్వభావాలంకారము లనావశ్యకములు, "కలము పట్టినవారెల్లఁ గవులు కానేరరు. హృదయభావముల వెలువఱుపకున్న, నుచితరస పోషణముఁ గావింపకున్న నది కవితగాదు. అష్టాదశవర్ణనములు, తలదిరుగఁజేయు కల్పనలు బంధములు, పద్యములోఁ బద్యములు, ద్వ్యక్షరత్ర్యక్షర

ప్రాసములు నిట్టి విచిత్ర శబ్ద చమత్కృతులన్నియు వ్యర్థ వాక్యావళీ విడంబనమే కాని మనోహర కవితాగానము కాదు" సంగీతమునందేమి, చిత్రలేఖనమునందేమి, కవిత్వమునందేమి, ద్వివిధములు కలవు. నయనములకో, శ్రుతి పుటములకో యానందము గలుగఁ జేయునని కొన్ని-హృదయమును దన్మయత్వములో ముంచి వేయునని కొన్ని; రవివర్మపటములు మొదటి జాతిలోనివి; అవనీంద్రనాథ టాగూరు చిత్రములు రెండవజాతిలోనివి; కంఠమాధుర్యము లేని సంగీత శాస్త్రజ్ఞుల రాగాలాపన మొదటిజాతిలోనిది. గవాయి పాట రెండవ జాతిలోనిది. వసుచరిత్ర మొదటిజాతిలోనిది. భాగవతము రెండవజాతిలోనిది. ఆఙ్గ్లేయ సారస్వతములో "పోపు" కవిత్వము మొదటి జాతిలోనిది. షెల్లీ (Shelley) కవిత్వము రెండవజాతిలోనిది. మొదటి రకము కంటే రెండవ రకము వేయిరెట్లు ఘనతర మని నా నమ్మకము.

అదియుఁగాక భావనాశక్తి యున్నప్పుడు, తన్మయీ భవన యోగ్యత కలిగినప్పుడు పదము లప్రయత్నముగ (Spontaneity) దొరలుచుండును. కవివ్రాసినటుల :-

"భావనాబల మున్నది ప్రకృతియున్న

దిష్ట ముండినఁ బదముల కేమి కొఱత?"

"నదీనదపదములు, కాసారపదములు, కేదార పదములు, సైకతపదములు, ఆశ్రమపదములు, ఆరామపదములు, పట్టణపదములు" అన్నియుఁ బదములే అందువలననే యీ పరికరములన్నియు సమకూడినపుడే పద్యములు వ్రాయవలెనని కొందఱందురు. యుద్ధనిధి సభలకో, కాంగ్రెస్సు సభలకో, యే దొరగారి మీఁదనో, యే సాహెబు మీఁదనో, యే సెట్టిమీఁదనో యరగంటలో మొదటి యక్షరముల జదివినచో నామము వచ్చునట్లును దుది యక్షరములఁ జదివినచో దీవన వచ్చునట్లును, "తయారు"చేయు పద్యములు పద్యములుకావు. సాధన సామగ్రియంతయును సమకూడినప్పుడే రచించు కావ్యములు

మహెూత్కృష్టములై యాచంద్రార్కముగ విరాజిల్లును.

తన పాటకన్నఁ గవి గానమే హాయిగానున్నదని కోయిల యనుకొనుచున్నట్లు టెనిసను మహాకవి వ్రాసినాఁడు.

"*.....The nightingale thought*

**I have sung many a songs but never a one so gay**

**For he sings of what the world will be**

**when the years have died away"**

అట్టికవన మీశ్వరవర ప్రసాదమే, దాని సౌరభము నాఘ్రాణించుటకుఁ గవిరాజచక్రవర్తి యగు నాతఁడే తనయూర్పు నట్టె యాపునని యొక కవికుమారుఁడు గర్వముతోఁ జాటినాఁడు.

*God holds his swift enchanted breath*

*To catch the fragrance on the wind*

'Harindranath Chattopadhyaya'

ఏకాంతసేవ యట్టి మహాగ్రంథములలో నగ్రస్థానము నలంకరించువానిలో నొకటి. కవనమున కుండవలసిన లక్షణములన్నియు నిద్దానికి సంపూర్ణముగఁ గలవు. నూతనాంధ్రసారస్వతములో నిట్టి కావ్యము వేఱొకటి లేదని నానమ్మకము.

ప్రభాత సమయమునఁ బ్రియురాలగు భక్తుఁడు హృదయేశ్వరునిఁగూర్చి కోయిలయై గొంతెత్తిపాడుట; కళ్యాణగీతిలో నవశయై చిక్కనకలకంఠిని గరుణించిన కళ్యాణమూర్తి కనుమొఱంగుటచే దుర్భర విరహానలములోఁ బరితపించు నామె ప్రణయాధినాథుని సందర్శనమునకై ప్రార్థించుట; "ఆత్మేశుతో నైక్యమందక యున్న నాకింత సేపైన నోపని యామె ప్రణయస్వరూపుని బట్టి తెచ్చుటకుఁ బ్రణయవనంబు లోపలిపుష్పరథములో" భ్రమరమే బాసటగా బయలుదేరుట; "పదిలమగు

పాణిద్వయముతో, నిశ్చలమగు నేత్రయుగముతోఁ, జెదరని చిత్తముతో, స్వామి నర్చించు పూజా ద్రవ్యసమితితో" నామె యాయత్తయై యుండుట "శ్రీ పుష్పయోగ సంసిద్ధికి" చేకూరుటయు, యుగయుగంబులనుండి మ్రోఁగుననంత విశ్వగానము-" నిత్యనూతనగానము – మఱల మఱలఁ బాడినదే పాటగా నామె పాడుట ... ఇయ్యది.

"మధురముగ, మార్దవంబుగా, మంజులముగ
మానసానందకరముగా, మంగళముగ"

మధుర పదజాలముతో మనోహరముగ వర్ణింపఁబడినది; "నెమ్మినెఱజాణ లాటకత్తెలుగా, కోయిలలు తోడగాయకులుగాఁ, దేఁటిరొద శ్రుతిగా, నందన వనమునను, మందాకినీ తీరమునను, ప్రభాతసమయమునను, చంద్రికా పులకిత యామినులను, నింగిపై నీలాలపేరు వ్రేలునట్లు, విశ్వమంతయు వెన్నెల తీఁగ ప్రాఁకునట్లు, దిక్కులన్నియు దివ్యగానములతో నిండునట్లు ప్రకృతియంతయుఁ బరవశయగునట్లు" ప్రవిమల భక్తియుక్తుఁడైన భక్తుఁడు పరమేశ్వరునిఁ గూర్చి పాడుప్రణయగీతము, ఇది భాగవతమువలెనే పఠింపఁదగినది; ప్రేమింపదగినది; శిరసావహింపఁదగినది.

వేయేల? ఇది విమర్శనాతీతము. వంగభాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో, మన యాంధ్రమున కీ మహా కవుల – భక్తుల యేకాంతసేవ యట్టిదని నా యభిప్రాయము.

# పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము
## (భారతి : 1948)

దాదాపు 1923 మొదలుకుని నేటిదాకా పాతిక సంవత్సరాలు కదా ! ఈ పాతిక సంవత్సరాల ఆంధ్రకవిత్వం స్థితిగతు లెలా ఉన్నాయో వ్రాయాలంటే చాలా చిక్కులున్నాయి.

నేనూ ఈ శకంలో వాణ్ణే ఆయెను ! మరి కొద్దో గొప్పో నేనూ కొంత సందడి చేసినవాణ్ణే ఆయెను !

ఇప్పటి ఆంధ్రకవిత్వాని కున్నంత వైవిధ్యము, సంపద, మరి ఏ ఇతర రాష్ట్ర కవిత్వానికీ లేవని నా గట్టి నమ్మకం. అసలు తెలుగునాటి సాహిత్య కేదారంలో కవిత్వపు పంట ఎప్పుడూ ఎక్కువే. ఆంధ్రదేశంలో ప్రతి రెండో వ్యక్తీ కవి లాగ కనబడుతున్నాడని ఒక ప్రఖ్యాత వంగకవి అన్నట్లు వింటున్నాను. ఇది పరిహాసానికి అన్న పలుకైనా పరమార్థం కలదిలాగే తోస్తుంది. ఇంతకీ ఈ మాట వంగజాతి గురించి కూడా అనవచ్చును. కవులూ, కవి రాజులూ అక్కడా ఇక్కడా కూడా ఎక్కువే. శ్రీ పాద కృష్ణ మూర్తి శాస్త్రి, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రుల వద్ద బయలుదేరి, వేంకటపార్వతీశ్వరులు, రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణరావు మొదలైన కవుల దగ్గర ఆగి, విశ్వనాథ సత్యనారాయణ పింగళి కాటూరి కవులు, నాయని నండూరి సుబ్బారావులు, శివశంకర

శాస్త్రి, వేదుల సత్యనారాయణ శాస్త్రి, కవికొండల వెంకటరావు, మాధవ పెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి, తుమ్మల సీతారామమూర్తి చౌదరి వంటి మధ్యతరం కవులను పలకరిస్తూ, మల్లవరపు విశ్వేశ్వరరావు, శ్రీరంగం శ్రీనివాసరావు, పిలకా గణపతిశాస్త్రి, సంపత్, హనుమ దింద్రగంటివంటి కవులు, పఠాభి, ఆరుద్రవంటి అతినవ్యులదాకా నా మనస్సు ఉత్సాహంతో ఉరకలువేస్తూ వచ్చేసరికి, నేడు మన యెదుట ఉండి, సాహిత్య క్షేత్రంలో యథాశక్తి కృషి చేస్తూన్న కవులు నూరుగురైనా నా యెదుట మెరుపుల్లాగ కనిపించారు. నాకు కొంత ఆనందమూ, గర్వమూ కూడా కలిగాయి. కనుపర్తి అబ్బయ్య చెప్పినట్లు, "చతుర కవిత్వతత్వ పటుసంపద యొక్కరి సొమ్ముగాదు, భారతి దయ సాధవార్ధి, కవిరాజుల మానసముల్ ఘటంబు, లాయతము కొలంది లబ్ధమగు నయ్యమృతంబు."

వీరందరూ కాక నిన్న మొన్నటిదాకా నవ్య సాహిత్య క్షేత్రంలో కృషిచేసి కీర్తిశేషులైపోయిన గురుజాడ అప్పారావు, బసవరాజు అప్పారావు, కీర్తిశేషు డనలేకపోతున్నాను గాని మా కొడవటిగంటి వెంకట సుబ్బయ్య, కొడాలి సుబ్బారావు, కొంపెల్ల జనార్దనరావు, త్రిపురనేని రామస్వామి చౌదరి, తుమ్మలపల్లి వెంకటరత్నము, పెనుమర్తి వెంకటరత్నము, దువ్వూరి రామిరెడ్డి మొదలైన దిట్టలు కూడా ఈ శకంలోని వారే. ఇంత కవిత్వ శ్రీసమృద్ధితో నిండి ఉన్న పాతిక సంవత్సరాల కవిత్వచరిత్ర స్పష్టంగా ఎరుకపరచడం పెద్ద ఇబ్బందే.

ఇంకొకరకం కష్టం ఉంది. ఇప్పుడు పరుగెత్తేటంత త్వరగా ఇదివర కెన్నడూ కాలం మనదేశంలో పరుగెత్తలేదు. నా చిన్నతనంలోనే ఎంత మందంగా నానుస్తూ నడిచేది ! సమాజమూ, వ్యక్తిజీవితమూ, వాటి అన్యోన్యసంబంధమూ, సమన్వయాలూ, వడిదుడుకులూ ఇప్పటిమోస్తరుగా అప్పుడు ఉండేవా! అప్పటి జమీందారును విష్ణుమూర్తి అనేసెయ్యవచ్చు; అధమపక్షం అభినవభోజుడనో, అధునాతన

కృష్ణరాయలంటో అనవచ్చు. అప్పటి కవి అగ్రకులం వాణ్ణనీ, "వెల నాటివాడ, కవితకు వెల నాటినవాడ" ననీ చెప్పుకోవచ్చు. అలాగ చెప్పుకుంటే అందరమూ, "ఓహోహో! భేష్ ! ఔ" ననవచ్చు కూడా. ఆస్తి విషయం, ఆస్తిక్య విషయం, మతం విషయం, మంచి చెడ్డల విషయం, కులం విషయం, కొద్ది గొప్పల విషయం, తెలుగువాడికి సంబంధించిన అన్ని విషయాలలోనూ ఈ 'ఔను కా' దనడాలూ, ఈ ఆందోళనలూ ఆవేశాలూ, ఇవన్నీ అప్పుడేవీ? వీరేశలింగం చేతి దెబ్బలకు ఆంధ్రజాతి నిద్రలోనుంచి కాస్త ఒత్తిగిల్లి, ఒళ్లు విరుచుకుని, కళ్ళు నులుముకుని అప్పుడే ఆవులించి లేచి కూర్చున్న రోజులవి. ఇప్పుడు వచ్చిన ఇబ్బంది ఏమిటంటే, అప్పటినుంచి నేటివరకు, మూడు తరాల వారూ ఒక్కసారే సమాజంలో ఇప్పుడు వేంచేసి ఉన్నారు; సాహిత్య క్షేత్రంలో కృషిచేస్తూనూ ఉన్నారు. ఇంకొక చిత్రం. రెండు మూడు తరాల ప్రభావాలు కొంత కొంతగా ఒక్కర్లోనే ఉన్నవారూ ఇప్పుడు ఉన్నారు. ప్రత్యేకంగా ఏదో ఒక సాహిత్య ధోరణి మాత్రమే ప్రశస్తమైన దంటూ, మిగతా వాటిని చిన్నచూపు చూసేవారు మూడు తరాల్లోనూ ఉన్నారు.

కాని సమాజం జీవనది. అయితే సాహిత్యమూ జీవనదే. మూడుతరాలవారినీ అసలుసాహిత్యగుణమనే జలసూత్రం బంధించి, ఏక కుటుంబంలోనికి తీసుకుని వస్తున్నది. అప్పటప్పటి కాల పరిస్థితులను అనుసరించి ఆయా ఉద్యమాల పలుకుబడిని బట్టి, కొన్ని కొన్ని కొత్తపాత సంస్కృతుల ప్రభావాలను బట్టి, తమతమ ప్రత్యేక ప్రతిభలను బట్టి, కవుల దృక్పథాలు మారవచ్చు; కనుక కావ్య వస్తువులు మారవచ్చు; కనుక కంఠధ్వనులూ, బాణీలూ మారవచ్చు, కాని, పట్టి చూస్తే కవిత్వమంతా ఒక్కటే కాదూ! ఈ ధీమాతోటే ఎన్ని ఇబ్బందులున్నా నవ్యాంధ్రకవిత్వాన్ని గూర్చి ఈ కాస్త వ్రాస్తున్నాను.

## 2

ఈ నవయుగంలో భారతజాతినీ, ఆంధ్రజాతినీ ఊగించిన ఉద్యమాలు ఏవేవి ఆంధ్రకవిత్వాన్ని కూడా అవహించాయో కొంత చెప్పాలి. నిజానికి ఈ యుగంలో వివిధ భారతరాష్ట్రీయ సాహిత్యాలు ఒకే ఒకరకపు ఉద్యమాల ప్రభావాలలో పడినట్లు కనబడతాయి. ఒకేరకపు ధోరణులు వాటిలో కనబడతాయి. కనుక ఈ ఉద్యమాలు ఎటువంటివో తెలుసుకుంటే నవ్యాంధ్ర కవిత్వ లక్షణాలు తెలిసిపోతాయి.

మొదటిది కాల్పనికోద్యమము (Romantic movement) జాతికి మృతస్థితివంటి నిద్రావస్థ ఒకటి వస్తుంది. అది పోగానే జాతి మేలుకుంటుంది. అంటే తిరిగి పుడుతుంది. అనేక ప్రభావాలవల్ల ఈ ప్రబోధం కలగవచ్చు. ఈ ప్రబోధం వచ్చినతరువాత బాల్య యౌవనాద్యవస్థల వంటివి జాతిజీవితంలో అన్ని కార్యరంగాలలోనూ గోచరిస్తాయి. కనుక సాహిత్యంలోనున్నూ, యౌవనదశలో ఉన్న వ్యక్తి తనంత వాడు లేనట్లున్నూ. తన అనుభవమంత అమూల్యమైనది లేనట్లున్నూ, లోకరంగంలో తానే నాయకుడైనట్లున్నూ అనుకుంటాడు. సాక్షిగా తటస్థుడుగా ఈ లోకాన్ని చూడలేడు. దానిలో పడి కష్టసుఖాలు తీవ్రంగా అనుభవించడమే అతనిపని. అతడెక్కువగా హృదయవాది. అనుభవం వైపు మొగ్గినంత ఆలోచన వైపు మొగ్గడు. ఈ అవస్థలో ఉన్న జాతి కూడా తనంత గొప్పదీ లోపం లేనిదీ లేదనుకుంటుంది, ఈ ఆత్మపరత, ఈ 'తన' తనం, నాటి సాహిత్యంలో బాగా స్ఫురిస్తుంది.

ఇక యౌవనాంగణంలో అడుగుపెట్టిన వ్యక్తిలో అద్భుతపూర్ణమైన ఒక దృష్టి కూడా ఉంటుంది. అదివరకు అతి సామాన్యంగా కనబడిన ప్రతివస్తువూ, ప్రతి సంఘటనా, కొత్తకొత్తగా గొప్పగొప్పగా గోచరిస్తాయి. "దాక్కొని ఉండి, దారిపక్క నిరుక్కొని" ఉండే గడ్డిపూవుకి నక్షత్రానికిచ్చే దివ్య గౌరవమిస్తాడు. జలతారు అంచు నీలిచీరను మెరుపుతో గూడిన మేఘమంటాడు. "ఈ నా

శరీరమందివతళించిన గాలి"లో హేమధూమసౌరభాల కోసంనాసాపుటాలు బిగబడతాడు. "ఈ నా తనూపూర్ణమైన ఆకాశం"లో క్రతుధ్వనులకోసం చెవు లొగ్గుతాడు. అప్పుడతని చేతకీ, వ్రాతకీ, సంయమం ఉండదు. ఆవేశానికి అడ్డకట్ట ఉండదు. కంఠానికి గడియ పడదు. "భావనాబలమున్నది; ప్రకృతి యున్నది ఇష్టముండిన పదములకేమి కొరత?" అంటాడు. వాగుతో, వాహినితో కలిసి కిన్నెరసాని పాట పాడేస్తాడు. 'నన్నెవ్వరాపలేరీవేళా' అనీ, ఇంటింట పెడతారు యెంకి నీ పేరు' అనీ, 'నా యిచ్ఛయే గాక నా కేటి వెరపు'అనీ అంటాడు. అతన్ని ఏవో లక్ష్యాలు కూడా ఆకర్షిస్తాయి. అప్పుడతనికి ధ్రువతార దూరంగా ఉన్నదనిపించదు. అందే మ్రానిపండులాగ అని పిస్తుంది. తన మనస్సును దానికి తగిలించి నమ్మకంగా ప్రయాణం సాగించేస్తానంటాడు. అతనిలో సాహసమూ, విజగీషా కూడా ఉంటాయి. కొత్త అనుభవాలకు స్వాగతం ఇవ్వడానికీ, కొత్తమార్గాల్లో పడిపోవడానికీ, కొత్తప్రయోగాలు చెయ్యడానికీ భయపడడు.

యౌవనంలో కవిత్వ లావణ్యం ఎక్కువ దొరుకుతుంది. ముదిరిపరువమైన వయస్సులో సాహిత్యసందేశం ఎక్కువ దొరుకుతుంది. అందుచేతనే కవి పెరిగి ముదిరి, 'జీవనగంగా హరితతటమ్మున" నిశ్చలనిశితమైన దృష్టులు సారిస్తూ కూర్చున్నప్పుడే రూపకం వంటి సాహిత్యం సృష్టించగలడు. ఇక పైని చెప్పినట్లు, కాల్పనికోద్యమానికి చెప్పిన గుణాలన్నీ–అనగా కాల్పనిక వేగం, లక్ష్యావేశం, విశృంఖలత, విజగీష, సాహసం, అద్భుతపూర్ణమైన మనస్థితి – చాలవరకు నవ్యాంధ్ర కవులందరిలోనూ కనబడతాయి.

## 3

నవయుగభారతంలో పుట్టిన మరి రెండు ఉద్యమాల ప్రభావం కూడా నవ్యాంధ్ర కవులపై ప్రసరించింది. దాదాపు నూటపాతిక సంవత్సరాలక్రితం రామమోహన రాయలతో పుట్టిన మానవోద్యమం

ఒకటి. దాదాపు ఆ రోజుల్లోనే రూసో మొదలైనవారి ప్రభావం వల్ల పాశ్చాత్య లోకంలో ఇలువంటి ఉద్యమమే పుట్టింది. ఇది ప్రతిమానవుని శిరస్సు మీదా మకుటం పెడతానంటుంది. మానవులందరికీ కూడా సామ్యము ఉండాలంటుందీ ఉద్యమం. దీనివల్ల ఎల్లయెల్లలూ, అన్ని అంతరాలు చెరిగిపోతాయి. జగత్తులో మానవుణ్ణి మించిన దేదీ దీనికి లేదు. పూర్వ భారతీయ విజ్ఞాన సంస్కృతుల్ని నిరసించదిది. ఎటొచ్చీ, తూచితూచి, సహేతుకంగా విమర్శించి, దేశ కాలపరిస్థితుల్ని బట్టి గ్రహిస్తానంటుంది. పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతుల్నీ అంతే. ఈ జగత్తు, మానవుడు, వాని అనుభవాలు, అన్నీ గట్టి పరమార్థాలనే శాస్త్రీయ దృక్పథం, వాస్తవికత కూడా ఈ ఉద్యమ లక్షణాలే. "అసీమమైన ఈ సృష్టిలో తూర్పేది? పడమ రేది?అవి ఒక హృదయం యొక్క, రెండు స్పందాలు" అనిన్నీ, "నా జాతి మానవ జాతి" (My caste is humankind)అనిన్నీ,,బతికితే స్వతంత్రుణ్ణాయి బతుకుతాను, లేకపోతే ఉండనే ఉండను" (I will be tree, or not be at all) అనిన్నీ, రాగల ప్రతి మానవుడూ చాటతాడని ఈ ఉద్యమం అంటుంది. ఈ ఉద్యమం విజాతీయంగా కనపడినా అలాంటిది కాదు. ప్రతి వ్యక్తికీ, ప్రతి జాతికీ కూడా వారి వారి విశిష్టత చెడకుండా ఈ ఉద్యమం స్వాతంత్ర్యం కోరుతుంది. ప్రతి వ్యక్తికీ స్వాతంత్ర్య వికాసాలు ఉంటేనే, జాతి సర్వాంగసుదరం అయి ముందుకు నడుస్తుందనీ, ప్రతిజాతికీ స్వాతంత్ర్య వికాసాలు ఉంటేనే ఈ మానవ లోకంలో సమృద్ధీ, శాంతీ, సుఖమూ ఉంటాయనీ ఈ ఉద్యమం అంటుంది.

ఈ ఉద్యమాన్ని ఆంధ్ర దేశంలో ప్రవేశపెట్టి ప్రబలం చేసినవాడు ప్రవక్త వీరేశలింగం.

ఈ ఉద్యమంలో మళ్ళీ రెండు తరాలు (Stages) ఉన్నాయి. ప్రారంభంనుంచి దాదాపు గాంధీయుగం దాకా ఒకటి; గాంధీయుగారంభంనుంచి మరొకటి. మొదటి యుగం లో విద్యాధికులైన

వారిమీదనే ఈ దీని ప్రభావం ప్రసరించింది. చుట్టూ ఉన్న సమాజమూ, దానిలో పేరుకుపోయిన విశ్వాసాలూ, కరుడుకట్టుకుపోయిన ఆచారాలూ, వాటిని ప్రతిఘటించి ఒక్కొక్క వ్యక్తి నలిగిపోవడమూ–ఇవే వారికి మొదట కనపడ్డాయి.కనుక ప్రత్యేక వ్యక్తిస్వాతంత్ర్యమూ, కష్టసుఖాలూ – వీటి కోసమే ఆ ఉద్యమం మొదట సాగింది. ఈ శకంలో భారత సాహిత్య సీమలో హిమాలయ శిఖరంలాగ ఆకాశంలోకి పొడుచుకుని పైకి లేచి, ఉద్యమానికి ఉత్తమోత్తమ ప్రతినిధిగా కనబడేవాడు రవీంద్రుడు. వ్యావహారిక భాషా వాదం ద్వారా గిడుగు రామమూర్తి పంతులునూ్న, కావ్యాలద్వారా గురజాడ అప్పారావునూ్న ఈ ఉద్యమాన్ని ఆంధ్రసాహిత్యంలో ప్రవేశపెట్టారు.

ఈ ఉద్యమం రెండోతరం గాంధీతో ప్రారంభమయింది. అదివరకు పండితపరిషత్తులలోనూ, ప్రాసాదాలలోనూ ఉండిపోయిన మానవ స్వామ్య సామ్యాలు ఇప్పుడు విపణులలోకీ, వీధులలోకీ, గుడిసెలలోకి చొచ్చుకొని పోతున్నాయి. అంతే గాక అదివరకు ప్రత్యేక వ్యక్తి స్వాతంత్ర్య వికాసాదుల కోసం కృషి చేసిన మహోద్యమం ఇప్పుడు సమిష్టి మానవ శ్రేయస్సు కోసం ఆందోళన మొదలుపెట్టింది. వివాహము, విద్య, మతము వంటి సమస్యలకన్న కూడా, ఆకలి, దారిద్ర్యము వంటి సమస్య రోజూ, ప్రతి జీవితాన్నీ ఎక్కువ తీవ్రంగా దగ్గరగా పలకరించే అతి వాస్తవిక సమస్య అంటుంది, ఈ ఉద్యమం. దీని వల్ల మానవుని ఏకత్వము, అన్యోన్యబాంధవ్యము, సమష్టిత్వము బాగా స్ఫురించి ధృఢపడతాయి అంటుందీ ఉద్యమం. నాటి మానవోద్యమాన్ని ఈ విధంగా నలభైకోట్లలోను నవ ప్రపంచ శక్తుల సహాయ్యంతో చాలవరకు నాటినవాడు గాంధి. గాంధియే కొంతవరకు కొత్తమానవుడు. సామాన్య శక్తి సామర్థ్యాలూ, సామాన్య జీవితాన్ని స్ఫురింపజేసే కూడూ గుడ్డా, కుటీరవాసమూ, జీర్ణ శరీరమూగల ఈ గాంధి ప్రభువులూ ప్రబలులూ పండితులూ చూస్తూండగానే ప్రప్రథమ పీఠం మీదికి ఏనాడయితే ఎక్కి కూర్చున్నాడో, ఆనాడే ప్రతి సామాన్యమానవుడూ

జగత్తంత మహాపీఠం మీద అధిరోహించి ఊరుకున్నాడు. ఇదివరకు సామాన్యలోకంకోసం మహాత్మ్యం అవతరించేది. ఇప్పుడు సామాన్య లోకం మహాత్మ్యం దగ్గరికి అధిరోహిస్తున్నది. మానవోద్యమానికి సంబంధించిన ఈ రెండోతరంలో భారత సాహిత్యలోకంలో టాగూరువంటి ఉన్నతుడింకా రాలేదు. దీనికి కారణాలు ఇవి అయి ఉండవచ్చు; లేక వీటిలో ఏదైనా ఒకటయి ఉండవచ్చు. ఇది వరకు ఒక్కొక్క వ్యక్తి ప్రతిభ పర్వత శిఖరం లాగ పైకి పెరిగేది. ఇప్పుడు అడ్డంగా పైరు పొలంలాగ పరుచుకుంటున్నది. దానికి ఔన్నత్యము, గాఢత్వము గుణాలు. దీనికి వైశాల్యము, వైవిధ్యము, వేగము, వేడి గుణాలు.

రెండు – యౌవన దశలోనుంచి జాతి పెరగడం వల్ల కవిత్వ యుగంలోనుంచే నాటకాలయుగంలోనికి సాహిత్యం ప్రవేశిస్తుందేమో! నాటకంలాగ మరి ఏ ఇతర సాహిత్య రూపమూ, సమాజ జీవితంతో పడుగు పేకలాగ పెనవేసుకొనిపోలేదు. నాటక రచయిత మహాగట్టి వాస్తవికుడు. ఇప్పుడు మనదేశంలో సమాజ రూపం స్ఫుటంగా ఏర్పడుతూ కొంతకొంత స్పష్టంగా కనిపిస్తున్నది.

మూడు – మనదేశంలో కవికి సమష్టి ప్రజాజగత్తు దూర దూరాలనుంచి 'మరోప్రపంచం'లాగే కనబడుతుంది. కాని సన్నిహితమైన ఆప్తానుభూతిలాగ పలకరించడం లేదేమో! కొంతవరకు ద్రష్ట అయిన కవి అంచులు చూస్తున్నాడు, కాని అందులోని వాడు కాలేదు, కవిత్వానికి కొంత ఆత్మీయత, ఆత్మ పరత కావాలేమో! ఆ కొత్త సమాజం సుస్థిరంగా ప్రతిష్ఠింపబడ్డాక రవీంద్రుని మించిన కవులే రావచ్చును.

## 4

ఈ మానవోద్యమం గాక నవభారతంలో ఈ యుగం లో మరోమహోద్యమం బ్రహ్మాండంగా విజృంభించింది, హైందవ

జాతీయోద్యమం. ఇది దయానంద రామకృష్ణ వివేకానందులతో ఉజ్జ్వలంగా ప్రారంభమై, లోకమాన్యునితో ఉన్నత శిఖరా లందుకుంది. చిరదాస్యనిద్రనుంచి మేల్కొన్న భారతీయుని దృష్టి ఒక్కసారి పూర్వ కాలాలలోకి చొచ్చుకుని పోయింది. అభిమానం వల్ల, ఆత్మవిశ్వాసం వల్ల ఈ దృష్టి మరీ నిశితమై, ధగధగా తొందరతొందరగా మెరసిపోతూ పరుగులెత్తింది. కవికి ఆత్మీయానుభవం కలిగించినంత ఆవేశమూ, వేడీ ఈ జాతీయోద్యమం కలిగించింది. ఎంతో ఆప్తంగా అయిపోయాయి మన పూర్వగాథలూ, విజ్ఞాన సంస్కృతులున్నూ. ఏ లోపమూ లేక సమగ్ర సుందరంగా శాశ్వత సత్యాలుగా కనబడ్డాయవి. "ప్రాత కొత్తల మేలికలయిక" అని అనడం కన్న, "ప్రాత వాటికన్న నీవు పొడిచే దేముంది? వాటిని మళ్ళీ శుభ్రపరచి సుస్థాపితం చేసికొమ్మం"టుంది ఈ ఉద్యమం.

ఈ ఉద్యమానికి ఉత్తమ ప్రతినిధులు వంగ సాహిత్య క్షేత్రంలో బంకించంద్ర, ద్విజేంద్రలాల్ రాయలు. ఈ ఉద్యమానికి చెందిన నవ్యాంధ్ర కవిత్వ సీమలో ఉన్నత శిఖరంగా సాక్షాత్కరించేవాడు విశ్వనాథ సత్యనారాయణ.

## 5

కాల్పనికోద్యమ ప్రభావం ఈ యుగంలో కవులందరి మీదా ప్రసరించింది. మిగిలిన ఉద్యమాలలో కొందరిమీద ఒక ఉద్యమప్రభావం, మరికొందరిమీద మరొక ఉద్యమ ప్రభావం ఎక్కువగా ప్రసరించాయి.

ఆ రోజుల్లోనే కొందరు మహావ్యక్తులైన గురుదేవులు తెలుగునాటి సాహితీపరుల మనోమందిరాల తలుపులూ, కిటికీలూ ఒక్కసారి తెరచి వెలుగులూ, గాలులూ లోపల ప్రవేశపెట్టారు. మొదట బందరులో, తరువాత కాకినాడలో, వెంకటరత్నం నాయుడుగారి ద్వారా-(వారిని

భక్తిశ్రద్ధలతో స్మరిస్తూ శిరస్సు వంచుకుంటున్నాను) మానవోద్యమమూ, దానికి సంబంధించిన ఉన్నతోజ్జ్వలములైన లక్ష్యాలూ, ఉర్దూ పారశీ కాంగ్ల సాహిత్యాల ఘనతా లావణ్యమూ వారి శిష్యులకు పరిచయమయాయి. రాజమహేంద్రవరంలో కూర్డ్రేవంటి ప్రతిభాశాలి కవికొండల వెంకటరావు అడవి బాపిరాజు వంటి కవులను తన చుట్టూ చేరదీసుకుని, అటు వర్డ్సువర్తు వంటి కవుల కావ్యాలూ, ఇటు పైరుచేలూ ఓడరేవులూ పల్లెటూళ్ళ పరిసరాలూ పుంతలూ వాటిలో జనమూ చూపించేడు. మరి బందరులో శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారున్న చోట కవిత్వపు తిరునాళ్ళే తిరుపతి వెంకటేశ్వరులు కవిత్వాన్ని ఒక ఉద్యమం చేశారు. సామంతుల ఆస్థానాలలోనే గాక, సామాన్య సదస్యులలో కూడా వారు కవితోత్సవాలు కావించేవారు. కాస్త చదువుకుని కంఠం విప్పుతున్న ప్రతికవి నోటా ఆ కవులితర కవులతో గావించిన సాహిత్య సమరాల గాథలు ప్రతిధ్వనించేవి. వారి విజిగీష వీనిని కూడా వేడెక్కించేది. తెనుగుతనము, కవితాదీక్ష, కల్పనాసమృద్ధి వారినుంచే వారి శిష్యులకు వచ్చి ఉండాలి. విశ్వనాథ సత్యనారాయణ, పింగళి కాటూరికవులు, త్రిపుర్నేని రామస్వామిచౌదరి, మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి వారి శిష్యులలో కొందరు.

ఇక్కడ మరొక్కమాట. హైందవజాతీయోద్యమం మన తెనుగునాటిలో కృష్ణా గుంటూరు మండలాలలో ఆంధ్రోద్యమరూపాన ఎక్కువగా విజృంభించింది. జాతి గౌరవాన్ని గూర్చి కావ్యా లల్లిన కవులందరూ దాదాపు అక్కడివారే.

## 6

"భారతి". పుట్టకపూర్వము, మా "సాహితి" రాకపూర్వమూ, ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక, ఆంధ్రభారతి, ఆంధ్ర గ్రంథాలయ సర్వస్వము, అనసూయ, శారద మొదలైన పత్రిక లలో కొందరు కవుల

కావ్యాలు వెర్రి ఆవేశంతో యువకవులము కొందరము చదువుకునే వారము. నాకు బాగా జ్ఞాపకం, 1914–16 సంవత్సరాలలో నేనూ, మా నండూరి సుబ్బారావూ నాయుడుగారి చరణసన్నిధిని ఉన్నప్పుడు, బసవరాజు అప్పారావు వచ్చి, గురజాడ వారి కావ్యాలూ, తన సెలయేటి గానమూ అహరహమూ ఆలపిస్తూ ఉండేవాడు. అతడు అమరదూతగా మాకు కనపడేవాడు. మేమూ ఆ కావ్యాలన్నీ కంఠస్థం చేశాము. అంతలో మాతో చింతా దీక్షితులూ, వేదుల సత్యనారాయణశాస్త్రి కూడా కలిశారు. దీక్షితులు గారికి గురజాడ కవిదేవుడు. వేదులకి రాయప్రోలు కవి కులగురువు. రాయప్రోలు సుబ్బారావుగారి ఖండకావ్యాలు ఆంధ్ర గ్రంథాలయ సర్వస్వం మొదలైన పత్రికల నుంచి చదివేవారం అప్పటికే అబ్బూరి రామకృష్ణారావు 'మల్లికాంబ' "ఊహాగానము"లోని కొన్ని పద్యాలు మా అందుబాటులోనికి వచ్చి మమ్మల్ని అమితంగా ఆకర్షించాయి. ఏమి రోజులవి !

1921 లోనో, 1922 లోనో ఒకనాడు సాయంకాలం చామర్లకోట్ల రైల్వేప్లాటు ఫారం మీద నేను నిలబడి ఉండగా, కొన్ని యేండ్ల తరువాత మా నండూరి కనపడ్డాడు. అప్పుడు ముసురుకూడా పట్టి, 'పాటపాటగా' చినుకులు పడుతున్నాయి. 'ద్వారకావాసా' వినుమని సుబ్బారావు గొంతు విప్పాడు. ఎంతబాగా పాడేవాడు సుబ్బారావు! ఇద్దరమూ అలాగే ప్లాటుఫారం మీద కూర్చున్నాం, 'గుండె గొంతుకలోన కొట్లాడుతాది' అని మొదలు పెట్టి తాను వ్రాసిన నాలుగు పాటలూ పాడాడు. నేనూ వినుమన్నాను. "ఆకులో ఆకునై" అనే నా కృష్ణపక్షంలో మొదటి పద్యం, "అన్వేషణమూ" చదివాను. మా బసవరాజు వింటే బాగుండునని ఇద్దరమూ అనుకున్నాం. మరి కొద్దిరోజుల్లో కాకినాడలో రోజూ సాయంకాలం ఊరిబయట చిన్న సమావేశాలూ సభాపతి భావరాజు సుబ్బారావుగారు. నండూరి వేదులా, చింతావారూ, పాటిబండ అప్పారావూ, బసవరాజూ, నేనూ, మామా

పద్యాలూ, గురజాడ, రాయప్రోలు ప్రభృతుల పద్యాలూ చదువుతుంటే, వాటిమీద విమర్శనలు సాగుతుంటే, మాకు తెలియకుండానే సాయంకాలాలు రాత్రులయేవి.

అలాగే అక్కడ గుంటూరు, తెనాలి ప్రాంతాలలో శివశంకరశాస్త్రి, నోరి నరసింహశాస్త్రి, కొడవగంటి వెంకట సుబ్బయ్య ప్రభృతులు కలిసేవారనుకుంటాను. మరి బందరులో విశ్వనాథ సత్యనారాయణ, నాయని సుబ్బారావు, పింగళి కాటూరివారు, అడవి బాపిరాజు, కొడాలి ఆంజనేయులు ఆంధ్రజాతీయ కళాశాలలోనూ అవతలా సమావేశమయేవారనుకుంటాను.

మరి ఒకటి రెండేళ్ళకి, దాదాపు అందరమూ సాహితీ సమితిలో సహధర్ములమై సహోదరుల కూటంగా కలిసి పోయాం. అయితే ఇక్కడ ఒక్క మాట చెప్పాలి.

1923 కి పూర్వమే మా వంటివారిని ఆకర్షించిన కవులలో ఒక్క గురజాడ అప్పారావు తప్ప మిగిలిన వారందరూ 1923 తరువాత కూడా సాహిత్యరంగంలో కృషి చేసినవారు కనుక, ఈ పాతిక సంవత్సరాల ఆంధ్రకవిత్వ చరిత్రలో కూడా వారుండనే ఉన్నారు. వారిని 1923 కి పూర్వులుగా జరపడానికి వీలు లేదు. వారిని గూర్చి ముందు కొన్ని మాటలు.

## 7

గురజాడ అప్పారావు 1915 లో చనిపోయినా, తరువాతనే జీవించడం ప్రారంభించాడు. ఆయన బిల్హణీయమూ, నీలగిరిపాటలూ, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో పడ్డాయని జ్ఞాపకం. 'లవణ రాజు కల', 'కన్యక', 'పూర్ణమ్మ' మొదలైన కావ్యాలు బందరునుంచి వెలువడే ఆంధ్రభారతి నుంచి కాబోలు చదివాము. కాల్పనికోద్యమంలో ఉన్న ఉత్తమలక్షణాలన్నీ స్వచ్ఛమూ నిసర్గసుందరమూ అయిన ఆయన వాణిలో వినబడతాయి.

సామాన్యుల గాథలూ, సామాన్యులకందే మాటలూ కావ్యావరణం లోనికి ప్రవేశపెట్టడం ఆయన గొప్పతనం. ఆ 'ముత్యాలసరం' కూడా అలాగే అమరింది ! ఆ ఛందస్సు తెలుగువాడి కష్టసుఖాలూ, కథలూ ఎంత బాగా చెప్పుతుంది ! "పాటలా ధరి చెట్లచేమలకై పాట పాడితే తాటివనమున ఆగి చంద్రుడు తాను చెవియొగ్గడమూ", "మంచి చెడ్డలు రెండె కులములు; మంచి అన్నది మాల అయితే మాల నేనౌదున్" అని చాటడమూ, "నలుగురు కూర్చుని నవ్వేవేళల పుత్తడిబొమ్మను పూర్ణమ్మను ఒక పరి తలచి" కన్నీరొలికించడమూ, "పెరిగి విరిగితి విరిగి పెరిగితి" నని స్వంత కష్టసుఖాలు తలపోసుకుని వాపోవడమూ, "ప్రేమ కలుగక బ్రతుకు చీకటి" అని ప్రేమికుడు కావడమూ- ఇవన్నీ ఆ కొత్త రోజుల్లో యువకవుల హృదయాలకు ఆనంద పక్షాలు తొడిగి, గూటిని దాటి యెగురని వాటికి, కొండంత జీవితాకాశాన్ని చూపెట్టాయి. వీరి రచనలన్నింటిలోనూ వీరేశలింగం మానవోద్యమ ప్రభావమే కనబడుతుంది. 'దేశభక్తి' అనే కావ్యంలో కూడా హైందవ జాతీయోద్యమపు దేశభక్తి స్ఫురించదు.

"విశ్వగాన వియత్తరంగిణి
భంగముల నుప్పొంగు నాతని గీతశీకరముల్"

అని ఆవేశంతో అతని కావ్యాలనుగూర్చి నాటి యువకవి అంటాడు. ప్రబోధ కావ్యము, ఆత్మపరకావ్యము, ప్రేమగీతము, కథాకావ్యము- అన్నీ తరువాతతరం వారికి మచ్చున కందిచ్చినట్లు ఆయన వ్రాశాడు.

1923కి పూర్వం సాహిత్యలోకంలో వేంకట పార్వతీశ్వరులది కూడా గట్టి ప్రభావమే. వీరి కావ్యాలకు తురాయి వంటిది 'ఏకాంతసేవ'. తెల్లవారగట్ట పెళ్ళివారిని లేపే మనోహరమైన సన్నాయి పాటలాగ నవయుగారంభంలో వీరి కావ్యగానం వినిపించేది. భాషలోనూ, ఊహలలోనూ, ఆవేశాలలోనూ పూర్వ సంప్రదాయాలను గౌరవిస్తూ,

ఉత్తమవంగ వాఙ్మయం ద్వారా వచ్చిన వైష్ణవ సాహిత్య ప్రభావాల్ని స్వీకరించి, వీరు కావ్యరచనలో కొత్తదనం చూపించారు. వీరి ఏకాంతసేవ, 1922 లో పుస్తకరూపాన వెలువడినది, యువకవికూటాల్లో ఎంతో ఆప్యాయంగా ఆలపించుకునే వారం. 1923 తరువాత వీరి కావ్యాలన్నీ సంపుటాలుగా వెలువడ్డాయి. వీరి మధుర ఖండకావ్యం కనబడని పత్రిక కొంతకాలం ఉండేదికాదు. వీరి గీతపద్యానికీ, మంజరికీ మంచి పలుకుబడి సంపాదించి పెట్టారు.

1923 కి పూర్వమే రాయప్రోలు సుబ్బారావు ఖండకావ్యాలతో కూడా మాకు స్నేహం ఏర్పడింది. ఆయన 'తెనుగు తోట' 'కష్టకమల' 'స్వప్నకుమారి', 'స్నేహలత', 'తృణ కంకణము', తరువాత 'జడకుచ్చులు', 'ఆంధ్రావళి', తరువాత 'మధుకలశము' – ఇవన్నీ అప్పటప్పటి యువకవుల్ని ఆకర్షించినంత అమితంగా మరేవీ ఆకర్షించలేదు. వాటిని కంఠస్థం చేసి, గొంతెత్తి ఆలపించినంత ఆప్యాయంగా మరే కావ్యాల్నీ అప్పటి యువకవులు ఆలపించలేదు. ఆయన మాటల కూర్పులూ వృత్తాల నడకలూ – వీటి ప్రభావం అప్పటి నవరచనలు చాలా వాటిలో కనపడతాయి. ఆంధ్రజాతి పూర్వౌన్నత్యము, తరువాత తెనుగుపడుచుల ప్రణయాలు, నగలు, నోములు, ముగ్ధక్రీడలు, చైత్రాషాఢాలు మొదలైన కాలాల ప్రకృతి విలాసాలు – ఇవన్నీ వీరి కావ్యవస్తువులు. కాల్పనికోద్యమ లక్షణాలు సముచితమూ, సరసమూ అయిన ధోరణిలో వీరి కావ్యాలలో కనపడతాయి. పాతమాటలే కొత్త వన్నె చిన్నెలూ వాసనలూ పూసుకుని, వింతవింతలై కొత్తపుంతలలో కూడి, కొత్త మూర్తులను (Images) కడుతూ, తెలుగు నాటిలోని ఒక తరగతివా రెరిగునన్న అరటితోటలనూ, పొలాల త్రోవలనూ, వాటి నడుమ నిట్టూరుస్తూ తిరిగే క్రొత్త ప్రాయపు వారినీ, పచ్చి బాలెంతలనూ, పేరంటాళ్ళనూ, పాడి ఆవులనూ ఎంత సొగసుగానయినా ఈయన ప్రదర్శిస్తాడు.

"ఉత్కోళాశానితంబమ్ముల్లొత్తి హత్తిన ఆంధ్రుల యశోదు

కూలసితాంచలములు" చూసిన జాతీయోద్యమంలో ప్రారంభించి, రవీంద్రుని యొద్ద గురుకులవాసం చేసి, ఆయన ప్రభావాన్నీ, తరువాత వైష్ణవ సాహిత్య ప్రభావాన్నీ, ఈయన స్వీకరించాడు. ఈయన కావ్యాలు మన మనస్సుల్ని ఒడిసి బిగబట్టుకుని ఉద్వేగంతో ఉరకలెత్తవు; మానవప్రకృతిలోని గొప్ప లోతుల్నీ పెద్ద ఎత్తుల్నీ చూపెట్టవు; హాయిగా ఒయారంగా ఆరామాల్లో విహారం చేయిస్తాయి. ఈయన కావ్యాలతో కాల్పనికోద్యమం అంగణంలో నుంచి ముంగిలిదాకా జరుగుతుంది.

ఇక్కడే అబ్బూరి రామకృష్ణరావుని గూర్చి చెప్పాలి. ఇతని దొక ప్రత్యేక కంఠరవమే కాని ప్రతిధ్వని కాదు. సొగసుగా సంస్కృతంగా ఉంటూ నవ్యంగానూ ఉంటుంది ఇతని వాణి. కొత్త ఛందస్సులను గడుసుదనంగా వాడాడు. 'నీళులయిలి వుల్ శ్రవోయుగళిలో కఠినమ్ముగ మ్రోగు" ననే మల్లిక గాథా, 'కాపుపాటా', 'అప్రాప్తమనోహారిణి', 'తిక్కన్న', 'పృథివీ ప్రశంస'- ఇవన్నీ పదేపదే పఠిస్తూ ఒక పంక్తి అయినా వదలుకోలేని మేలిమి బంగారుముద్ద ఈయన కావ్యం అనుకునే వారం.

1923 తరువాతనే ఎక్కువ వ్రాసినా, అంతకు పూర్వమే నావంటి కవులు కొందర్ని బసవరాజు అమితంగా ఆకర్షించాడు. బసవరాజంత సూటిగా తీక్ష్ణంగా తన కష్టసుఖాలను కావ్యాల్లో వెళ్ళబోసుకున్న నవకవి మరొకడు లేడు. అంతరంగ స్నేహితుడూ, తానూ, ఏకాంతంగా కూర్చున్నప్పుడు, దాపరికంలేని అమాయకత్వపు తొందరలో హృదయభావాలు వెళబోసుకున్నట్లు పాటలో, పద్యంలో ఇతడు చెప్పుకొనేవాడు. ఆ పాటలూ, పద్యాలూ, నిట్టూర్పులు; జీవిత గర్భంలో నుంచి దొలిచి ఒరుసుకుంటూ వచ్చినవి. అలాగ చెప్పుకుందుకే అసలు ఇతని కావ్యరచన- "Relief which a timely utterance gives" అన్న దానికోసం! ఆ చెప్పుకోవడపు తొందరలో, భావనకీ భాషకీ చోటియ్యక, అవి లేని లోపాలను పాట కనబడనీయదు కనుక,

పేలవమైన మాటలతో నయినా నగ్నంగా అనెయ్యడానికి భయపడే వాడు కాడు. ఇతని కావ్యాలవల్ల నవకవిత్వానికి మరీ నవ్యత వచ్చింది; ఆత్మపరమైన గేయకావ్యానికి మరికొంత స్ఫుటమైన ఆకారం వచ్చింది. ఆ రోజుల్లో ఎన్ని సార్లు ఏకాంతంలో బసవరాజు కావ్యాలు పాడుకునేవాణ్ణో! మరెందరు సాటి యువకులు చదువుకుని సంతృప్తిపడేవారో!

## 8

1923 కీ మా సాహితీసమితికి నిండురూపం వచ్చింది. సాహితీసమితి నవ్యకవిత్వాన్ని ఒక ఉద్యమంగా చేసింది. అంతకుముందే అప్పటికవులం చాలామందిమి ఒకర్ని ఒకరు కలుసుకోకపోయినా, సాహితి మొదలైన పత్రికల్లో పడ్డ ఖండకావ్యాలు చదువుకుని, ఎప్పటినుంచో ఎరిగున్న దగ్గిర చుట్టాలు లాగ అనుకునేవారం. కాని ఎలాంటి మధురగాఢమైన బంధం మమ్మల్ని అందర్నీ చుట్టి పెనవేసి పట్టుకున్నది! ఒకరి కొకరం మా కావ్యాల్ని గూర్చి, కష్టసుఖాల్ని గూర్చి ఉత్తరాలు వ్రాసుకునేవారం. 'అన్యోన్యము మెచ్చుకునే సంఘం వీళ్ళది' అని కొందరు మమ్మల్ని అనేవారేమో! కాని ఆమాట అన్యాయం. అప్పుడు అమాయికపు ప్రాయంమాది. కీర్తికామమూ, స్వార్థమూ, అహంకారమూ మా మనస్సుల్ని కలుషితం చెయ్యలేదప్పుడు. అసలు యువప్రకృతుల్లో మాలిన్యం తక్కువ. గడసరి దాపరికాలు లేని రోజులవి. జీవితానుభవాలు ఒకటే రకంవి; రచనల్లో నవలావణ్యమూ కనపడేది; హృదయాలు ఒకదానికొకటి ఎదురయి హెచ్చరించుకునే సరిక్రొత్త ప్రభాతసమయం అది! అందుచేత సాహితీసమితివంటి అన్నదమ్ములకూటం ఏర్పడింది. ఏమో, నాకు మాత్రం సమితివారూ, సాటికవులూ, సాహితీపరులందరూ ఎప్పటికీ రక్తబంధువులకన్నా ప్రియులు!

1923 నాకూ గొప్ప సంవత్సరమే. ఆయేడు నా స్కూలు మేష్టరీ ఉద్యోగం నా అదృష్టం వల్ల పోయింది. రాజమహేంద్రవరంలో

హరీంద్రనాథ చట్టోపాధ్యాయులు కావ్య పఠనం చేస్తూంటే విన్నాను. అప్పటివరకూ వచ్చిన నవ్యాంధ్ర కవుల పద్యాలెన్నో నాకు కంఠస్థాలు. నేనెందుకు అలాగ తిరుగుతూ నాలుగు చోట్లా చదవకూడదు ? అప్పటికి మా వెంకటసుబ్బయ్య 'సంధ్యారాగం' వచ్చింది. విశ్వనాథ 'ఆంధ్రపౌరుషం' వచ్చింది. పింగళి కాటూరుల 'తొలకరి', నోరి 'గీతమాలికా' వచ్చాయి. ఇదివరకు వచ్చిన కవుల పద్యాలు ఉండనే ఉన్నాయి. శారద, భారతి, సాహితుల్లో పడ్డ కొత్త పద్యాలున్నాయి. వీటిలో కొన్ని ఏరి, ఒక కావ్య పంథా, పథకం ఏర్పరిచాను. 'సంధ్యారాగం' లోని 'ఆగుమాగుము తెరువరీ' అన్న స్వాగతంతో ప్రారంభించి, 'తొలకరి'లోని 'కవితాసామగ్రి' తరువాత చదివి, మిగిలిన కావ్యాలు వరసగా చదివేవాణ్ణి. చదివేవాణ్ణేమిటి. పాడేవాణ్ణి ! 'యెంకి పాటలో' పాడేవాణ్ణి. వాటి నావేశంతో పాడుతున్నప్పుడు విని, 'యెంకిపాటల' రచన నాకు కల్పించి, తగని గౌరవం నాకు ఇచ్చినవాళ్ళు ఉన్నారు.

బసవరాజు, విశ్వనాథ, నండూరుల్ని తలుచుకుంటే ఏమి పాడానో అనిపిస్తుంది ఇప్పుడు! ఆవేశమో, ఆ యా కావ్యాలంటే నాకున్న అకలంకమైన అనురాగమో, నాటి నా పద్య పఠనానికి కొంత ఆకర్షణ కూడా ఇచ్చి ఉండాలి ! లేక పోతే ఎన్ని సంవత్సరాలో, ఎన్ని సభల్లోనో ఎందుకు చదవనిస్తారు? మొట్టమొదటి నా కావ్యపఠనం దామెర్ల రామారావుగారి యింట చిన్న సభలో అనుకుంటాను. ఆయనకీ, ఆయన అన్నగారికీ, నా పద్యాలన్నా, నా చదవడమన్నా చాలా యిష్టం. తరువాత దాదాపు పదేళ్ళపాటు పద్యాలు చదువుతూ దేశమంతా తిరిగాను. ఓ! ఏమి తిరగడం! అప్పుడు నాకు నిత్యమూ కవిత్వోత్సవం కావాలి. ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే నవ్యకవిత్వం ఒక తీవ్రోద్యమమయి నిలవడానికి ఈనాకృషి కొంతవరకయినా కారణమని ఇప్పుడింత దూరాన్నుంచి అనుకుంటే మన్నించండి.

1923 లోనో, 24 లోనో పిఠాపురం నుంచి బయలుదేరి,

త్రోవలో నూజివీటిలో నండూరి సుబ్బారావును చూచి, అక్కడ నుంచి తెనాలి వెళ్ళి, వజ్ఝ బాబూరావు వీరరాఘవ స్వాముల్ని చూసి, గుంటూరు శివశంకరశాస్త్రిగారి కోసం వెళ్ళాను. 'హృదయేశ్వరి' తయారవుతున్న రోజులవి. అక్కడే 'నోరిని' చూశాను. అందరమూ కలిసి, త్రోవలో బెజవాడలో 'సాహితి'ని సంపాదిస్తున్న కొడాలి ఆంజనేయుల్ని కలుసుకుని, బందరు వెళ్ళి, అక్కడ కళ్యాణమండపం లాగ కలకలలాడుతూ ఉన్న జాతీయ కళాశాలలో విశ్వనాథ, అడవి మొదలైన కవుల్నీ, రామకోటీశ్వరరావుగారినీ కలుసుకున్నాను. వీరందరూ 'సాహితీ సమితి'.

కవిమిత్రుల నందరినీ చూసి రావడం వల్ల నాకు కొంత ధైర్యమూ, బలమూ వచ్చాయి. వసంతవాడలో వేలూరి శివరామశాస్త్రిగారికి 'ఆకులో ఆకునై' అన్న నా పాటను వినిపించాను. బందరులో 'అబ్బ'! అన్న నా ఖండకావ్యాన్ని విశ్వనాథ బాగా మెచ్చుకున్నాడు. ఇటు విజయనగరం, పర్లాకిమిడి, బరంపురాలకి బయలుదేరాను. పర్లాకిమిడిలో గిడుగు రామమూర్తి పంతులుగారిని కలుసుకుని మా కావ్యాలన్నీ వినిపించాలని నా సంకల్పం. నాకు బాగా జ్ఞాపకం–కొత్తగా పెంచిన నాగిరిజాలను వ్రేళ్లతో లాలిస్తూ, వారు నాతో మాట్లాడుతూ, మా పద్యాలు వినడం ! ఈ గిరిజాలు ఎన్ని కష్టాలు తెచ్చి పెట్టాయి. నవకవికి! కేశసంపదకీ, కవిత్వశ్రీకి నిజానికి సంబంధం ఏముంది ? మరి సమితి వారందరూ గిరజాలు పెంచనూ లేదు; పెంచిన వారయినా కుటిల శిరోజపాశాలతో సాహిత్యలోకాన్ని బంధించి జయించాలని అనుకోనూలేదు. బాగుంటాయని పెంచిన గిరజాలు ! అంతే ! తరువాత లోకం ఒత్తిడివల్లో, విరక్తివల్లో, మావాళ్ళు అందరూ తీసేశారు; నాకు ఇంకా ఉన్నాయి. నవ్యకవిత్వానికీ గిరజాలకీ ఈ సంబంధం కల్పించడం, నవ్యకవిత్వ ప్రతినిధిగా సభల్లో కనపడుతూ వస్తూన్న నన్ను తెనుగువారు చూస్తూ ఉండడం వల్ల కొంతవరకున్నూ, తరువాత మా తరువాతి యువకవులు మరికొందరక్కడా అక్కడా వాటిని పెంచడం వల్ల కొంతవరకూనున్నూ, అనుకుంటాను.

రామమూర్తి పంతులుగారి మెప్పు నాకు పెద్ద ఆలంబన మయింది. 'కృష్ణపక్షం' ప్రచురించాను. స్ఫుటంగా నా మనస్సులో నాటుకునిపోయిన మరి రెండు మూడు ఘట్టాలు ఉన్నాయి. 1925 లో నేమో అక్కిరాజు ఉమాకాంతం గారు వ్రాసిన 'నేటికాలపు కవిత్వము' అనే గ్రంథం వచ్చింది. అశనిపాతమంత తీవ్రధాటితో వచ్చింది. రాకేంజేస్తుంది? ఎప్పుడయితే నిజమైన ఒక ఉద్యమం బయలుదేరిందో, అప్పుడే దాని గుణదోష విమర్శన కూడా వస్తుంది. ఆయన తీవ్రవిమర్శ నుంచి నావంటి కవులు నేర్చుకోవలసినది లేకపోనూ లేదు; కాని కొంత ఆర్ద్రదృష్టితో కవితాహృదయముతో ఆ విమర్శన సాగితే, నేటికాలపు కవిత్వంలో వారు చక్కదనమూ కవిత్వ గుణమూ గ్రహించి ఉండేవారు. ఊపిరాడనీయనంత కోపంతో ఆ గ్రంథం దాడిచేసినట్లనిపించింది నా వంటివారికి. దానికి జవాబు వ్రాద్దామా అన్నారు కొందరు మిత్రులు. ఏమి జవాబు మేము వ్రాయగలం ? కొత్త పద్యాలు వ్రాయడమే జవాబనిపించింది. వ్రాయకుండా ఎలాగుండగలం? ఈ సంకల్పం 1925 లో మదరాసులో మరీ దృఢపడింది.

'కృష్ణపక్షము' ప్రచురించాక మదరాసు వచ్చాను. అక్కడ నండూరి సుబ్బారావు లా కాలేజీలో చదువుతూ 'యెంకి పాటలు' అచ్చు వేయిస్తున్నాడు. బసవరాజు 'ఆంధ్రపత్రికలో' ఉన్నాడు. నాయని ఉన్నాడు. రోజూ కలుసుకుని పద్యాలూ, పాటలూ చదువుకునేవాళ్ళం. ఆ సమావేశాల ఫలితం, కొత్త ఉత్సాహంతో ఇంకా కావ్యాలు వ్రాయడమే. 1925 డిశంబరులో నేను ఎన్నడూ మరచిపోలేని సమావేశం మల్లంపల్లి సోమశేఖరశర్మగారి యింట జరిగింది. విశ్వనాథ, నాయని, అడవి బాపిరాజు, నండూరీ, రామకోటేశ్వరరావుగారూ, భావరాజు సుబ్బారావుగారూ, ఆచంట జానకిరాం, నేనూ రెండు మూడు రోజులు మల్లంపల్లి వారి యింట్లో కలుసుకునేవారం. కావ్యపఠనం సాగేది. ఒక సాయంకాలం విశ్వనాథ 'అనార్కలీ' నాటకం చదవడం ఇంకా జ్ఞాపకం.

తరువాత కొందరం ఉమాకాంతం గారి యింటికి వెళ్ళి వారిని చూశాముకూడా.

1925 లోనే నాకు హరీంద్రనాథునితో మైత్రి గాఢమయింది. ఇద్దరమూ బెంగుళూరు వెళ్ళడమూ అక్కడ నా పద్యాలు కొన్ని ఆంగ్లంలోనికి అతడు అనువదించడమూ, జరిగింది.

1925లోనే 'సఖి', అంటే సాహితీ సమితి పత్రిక, బయలు వెడలింది. అదికాక, తరవాత, మా విశ్వనాథ 1927 లో సంపాదించిన 'జయంతి', ఆ తరువాత కొంపెల్ల జనార్దన రావు నడిపించిన 'ఉదయిని', పాటిబండ మాధవశర్మ 'వీణ', ముద్దుకృష్ణ 'జ్వాల', నవ్యసాహిత్యంకోసమే పుట్టాయి.

1927 డిశంబరులో మరొక చిన్న సాహిత్యోత్సవం అత్యుత్సాహంతో మదరాసులో జరిగింది. రామకోటీశ్వర రావుగారి 'త్రివేణి' బయలు వెడలిన రోజున వారి యింట్లో మల్లంపల్లి వారికి విశ్వనాథ ఆంధ్రప్రశస్తి అంకిత మియ్యడమూ, మేమందరమూ సమావేశమయి ఆనంద వివశుల మవడమూ జరిగింది.

ఇదంతా బొత్తిగా స్వంతఘోషగా కనపడ్డా నిజానికి అలాగ కాదు. ఒక సంఘంగా ఏర్పడడం, దానికోసం పత్రికలు ప్రచురించడం, సమావేశాలు కావడం, పర్యటనచేస్తూ ప్రచారం-ఇన్నీ కలిసి, నవ్యకవిత్వాన్ని, నవ్య సాహిత్యాన్ని, ఒక ఉద్యమంగా ఎలాగచేశాయో తెలియజేస్తాయి కనుక ఇదంతా వ్రాశాను.

## 9

ఇక్కడ మరి నాలుగు మాటలు. పూర్వ గాథల్ని ఇలాగ నెమరు వేసుకోవడంలో, కొందరు ప్రియతములు, ఇప్పుడీ కళ్ళకి కనపడకుండా లోకావరణం దాటిపోయిన వాళ్ళు, నా మనస్సుని పట్టుకుని ఎంత దుఃఖమూ వేదనా అయినా కలిగిస్తున్నారు. వెంకటసుబ్బయ్య బసవరాజు,

జనార్దనరావు మరి కనబడరు; కొడాలి సుబ్బారావు, పెనుమర్తి వెంకటరత్నం వెళ్ళిపోయారు; రామిరెడ్డి వెళ్లిపోయాడు. కొత్తయుగపు తీవ్రావేశాలతో, అనుభూతులతో క్రిక్కిరిసిపోయిన ముప్పై నలభై యేళ్ళ వీళ్ల జీవితాలు నలిగి నశించిపోయాయేమో అనిపిస్తుంది. "ఎవరు పోయినా మే మెప్పుడూ ఏడుగురమే", అన్న ఆంగ్ల కావ్యంలో లాగ, అమరజీవులైన వాళ్ళతో కలిసి, మేమందరము ఎప్పుడూ ఉండనే ఉన్నాము.

ఇక్కడ కవులు కొందర్ని గూర్చి వ్రాస్తాను. మంచి శక్తి సామర్థ్యాలు ఉన్న మరికొందరు కవులను వదిలేస్తే వారి కవిత్వమంటే నాకు గౌరవం లేదని కాదు. ఈ రచన సాగించే ధోరణిలో ఆయా ఉద్యమాలకి ప్రతినిధులుగా కనపడే కొందర్ని గూర్చే వ్రాయగలనుగాని, ఇంత చిన్న అవధిలో కవులందరినీ ఎలాగ క్షమడ్చగలను!

రాయప్రోలు తొలి కావ్యాలలో మధురంగా వినబడిన పూర్వాంధ్ర గాథలు మరీ గాఢోజ్జ్వలంగా విశ్వనాథ 'ఆంధ్రపౌరుషము' 'ఆంధ్రప్రశస్తి' మొదలైన కావ్యాల్లో ప్రత్యక్ష మౌతాయి. ఇతని ధోరణిలోనే కొడాలి సుబ్బారావు తీవ్రావేశంతో 'హంపీ క్షేత్రము' వ్రాశాడు. తుమ్మల సీతారామమూర్తిచౌదరి నిర్దుష్ట మధురమైన 'రాష్ట్ర గానము' మొదలైన కావ్యాలలోనూ, ఆంధ్రలోకాన్ని అమితంగా ఆకర్షించిన జాషువాకవి కావ్యాలలోనూ, మరికొందరు కవుల కావ్యాలలోనూ 'జారిన దేశ గౌరవము చక్కదిద్ద' వలెనన్న ప్రబోధ వేగము బాగా స్ఫురిస్తుంది. ఆత్మపరంగా 'గిరికుమారుని ప్రేమగీతాలు' మొదలైన కావ్యాలు విశ్వనాథ వ్రాశాడు. 'కిన్నెరసాని పాట', 'కోకిలమ్మ పెళ్ళి', 'అనార్కలీ' నాటకంలో కొన్ని పద్యాలు, ఇవన్నీ అతని గేయకావ్యాలు (Lyrics) 'ఆంధ్రప్రశస్తి'లో 'మాధవవర్మ' వంటి కథా కావ్యాలు ఉన్నాయి. 'ఋతుసంహారం' వంటి వస్తు పరమైన కావ్యం వ్రాశాడు. ఇతను శతకం వ్రాశాడు; 'ఉదాహరణం' వ్రాశాడు. ఇప్పుడు 'రామాయణ కల్పవృక్షము' అనే మహాకావ్యం వ్రాస్తున్నాడు. ఇతనిది 'గాఢప్రతిభ' – మహాకావ్య ఘట్టోలంఘన

పటిష్ఠ' మైనది. ఇతనిలో తెలుగుతనం ఎక్కువ; సాహసమూ, విజిగీషా అమితం. ఎట్టి వస్తువునయినా కావ్య వస్తువుగా తీసుకుందుకు జంకడు; ఎట్టి మాటనయినా కావ్యభాషలో పొదగడానికి వెనుదీయడు. కల్పనాదీక్ష, ఏకాగ్రత, భావనాసమృద్ధి–ఈ గుణాలు కలిగి అవిశ్రాంతంగా కావ్య సృష్టి చేస్తాడితను. హైందవజాతీయోద్యమం ఇతని కావ్యాల్లో ఉజ్జ్వలంగా సాక్షాత్కరిస్తుంది. తరతరాల హైందవ విజ్ఞాన సంస్కృతులను నేటి ఆంధ్రలోకంలో పునఃప్రతిష్ఠ చేయాలనే ప్రయోజన మర్థించి ఇతడు కావ్యరచన కావిస్తున్నట్లు కనపడుతుంది.

అటు నెల్లూరిలో దువ్వూరు రామిరెడ్డి ఈ యుగంలో ప్రత్యేకంగా కనబడతాడు. ఇతనిది గొప్ప సంస్కారము; సమగ్రసుందరమూ, నిర్మలమూ అయినది. ఇతని స్వభావము లాగే నిర్దుష్టమూ, స్వచ్ఛమోహనమూ ఇతని వాణి. మొదట 'జలదాంగన', 'కృషీవలుడు' వంటి కావ్యాలలో, తరువాత 'పానశాల' మొదలైన కావ్యాలలో ఇతని నవ్యతా, ప్రతిభా బాగా స్ఫురిస్తాయి

ఈ యుగంలోనే అటు రాజమహేంద్రవరంలో కవి కొండల వెంకటరావుది వింత గొంతు. ఇతడు కర్షకుని వద్ద ఆగడు; 'కూలీ అన్నల' దాకా పోతాడు. రామిరెడ్డిది సంస్కృత మైన వాక్కు; కవికొండలవాణి మహావిశృంఖలంగా, చిత్రంగా రకరకాల 'ఛందస్సులతో దాక్కుని ఇరుక్కుని' నడిచిపోతుంది. ఓడరేవులూ, సరంగులూ, 'ఉత్తరాలా సంచి నెత్తి పెట్టుక పోవు' వాళ్ళూ –ఇట్టి సామాన్యజనానికి ఇంతగా సన్నిహితుడైన తెలుగుకవి ఈ యుగంలో మరెవ్వడూ లేడు. ఇతని మీదా, అడవిబాపిరాజు మీదా కూల్రిడ్జ్ ద్వారా వర్డ్సు వర్తు వంటి ఆంగ్ల కవుల పలుకుబడి ప్రసరించి ఉంటుంది. బాపిరాజు 'గంగిరెద్దు', 'పట్టిసం', 'గోదావరి'లో ఆ ప్రభావం కనబడుతుంది; ఇంత అనుభవానికి ఇతని హృదయం కదులుతుంది; తీర్చిదిద్దిన భాషలో ఆ అనుభవాన్ని పొదగడానికి కావలసినంత స్తిమితం ఇవ్వక ఇతని భావన పరుగెత్తుతుంది.

బందరులో పింగళి కాటూరికవుల 'తొలకరి'లో కొంత జాతీయోద్యమ ప్రభావం కనపడినా, 'సౌందరనందం'లోనూ తరువాత కాటూరి 'పౌలస్త్య హృదయము','గుడిగంటల' లోనూ, మానవోద్యమ వికాసం బాగా స్ఫురిస్తుంది. పూర్వాంధ్ర మహాకావ్యాలన్నీ మనస్సులో ఇంకగా ఇంకగా తయారయిన శిల్పమూ, బాణీ వీళ్ళది. శాంతసుందరంగా గంభీరంగా, మహోహిందాగా నడుస్తాయి వీరి భావనా, పద్యమూ కూడా. వ్యక్తిపరమైన ప్రేమ సంఘాన్ని ఉజ్జీవింపజేసే కరుణగా ఎలాగ మారిందో 'సౌందరనందములో' వర్ణిస్తారు. దీనిలో గాంధీయుగ ప్రభావం కనిపిస్తుంది. 'ఆకుల్ రాలని పూలు వాడని వసంతా రామం'లాగ ఉంటుంది వీళ్ళ కావ్యం.

స్వామి శివశంకరశాస్త్రులు (పూర్వాశ్రమంలో ప్రియతములైన మా అన్నగారు) తమ గ్రంథాల ద్వారానేకాక సాహితీసమితి ద్వారా కూడా నవ్య కవిత్వానికీ, సాహిత్యానికీ గొప్ప పటిమ ఇచ్చారు. వీరు మహావ్యక్తి; వీరే ఒక సంస్థ. ఎన్ని భాషలో వీరెరుగుదురు; ఎన్ని సాహిత్య హృదయాల లోతులో తరచిచూశారు. కాని సంస్కృత వాఙ్మయమంటే మోజు ఎక్కువ. వీరి హృదయం ఎంత ఆర్ద్రమూ, అకలంకమూ కాకపోతే, వీరి ప్రతిభ ఎంతగాఢమూ నిశితమూ కాకపోతే. చిత్ర చిత్ర ప్రకృతులుగల కవులనందరిని ఒక్క కూటంలో అంతకాలం కూర్చి ఉంచగలరు ! వీరి 'హృదయేశ్వరి' ఆత్మపరమైన కావ్యాలసంపుటి. తీవ్రానుభవాలలో వేగిపోయే హృదయం వాటిలో వేడివేడిగా ఎంతైనా కనపడుతుంది. వీరి అనుభవాలు కొత్తవి; కావ్య రూపాలు కొత్తవి వీరు కల్పించే చిత్రాలూ, అలంకారాలూ ప్రాత సంప్రదాయాలకు దగ్గరగా ఉన్నట్లనిపిస్తాయి; వీరి భాషమీద కూడా సంస్కృత ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది; వీరి పద్యం నిదానంగా, గంభీరంగా నడుస్తుంది. ఎక్కువ వేగమూ, ఆవేశమూ 'పెద్దమనిషి తరహా' కాదన్నట్లు. వీరి దివ్యలోచనములు' వంటివి మహామంచి కావ్యాలు. వీరి 'మేడూరి వాకి

కోడలు' మంచి కథా కావ్యం. వీరి పద్య రూపకాలు వ్రాయడంలో మార్గదర్శి. వీరి కవిత్వ ప్రభావం నోరి నరసింహశాస్త్రి మీద ఎక్కువగా ప్రసరించింది. చిన్నతనంలో నోరి ఆత్మపరమైన చక్కని పద్యాలు వ్రాశాడు. ఇప్పుడు 'దేవీ భాగవతము' మహాకావ్యంగా రచిస్తున్నాడు. ఇతనిది గట్టి దీక్షా, సంస్కృతీ, వైదుష్యమున్నూ.

ఇంక, మాతరం వారై, దాదాపు ఒకే రకం అనుభవాల్ని ఆత్మ పరమైన కావ్యాలలో చెప్పుకున్న కవులు నలుగుర్ని గూర్చి కొంచెం చెప్పాలనుకుంటున్నాను. వీళ్ళు నాయని సుబ్బారావు, నండూరి సుబ్బారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, కృష్ణశాస్త్రి-అంటే నేను.

నాయని సుబ్బారావుకూడా కవిత్వం చెప్పవలసి చెప్పాడు - బసవరాజులాగ, హృదయభారం విడబోసుకుందుకు ! ఆ రోజుల్లో ఆ కావ్యరచనే లేకపోతే అతని జీవితం ఎంత బరువుగా అయిపోయేదో! ఎటొచ్చీ, 'నాయని' వ్రాసినదంతా బంగారం. హృదయావేశమూ, భావనా, భాషా అన్నీ ఒకదాని కొకటి పెనవేసుకునిపోయి, కావ్యరూపాన కనబడితేనేగాని మనిషిలాగ కష్టసుఖాలు చెప్పుకోలేవు కనుక అలాగ కలిసిపోతా యనిపిస్తుంది. నండూరి 'యెంకిపాటలూ' అంతే! ఇవి కూడా నండూరి ఆత్మానుభవాలే చెప్తాయి; 'యెంకి నాయుడు బావల' గొంతుల్లోనుంచి మొదటా, తరువాత నండూరి గొంతులోనుంచిన్నీ. ఇతని రచన అంతా కవిత్వపుముద్ద. మాటలు ఎంతతక్కువగానో వాడతాడు! కాని ఎంతో జిగి తగిలించి ప్రౌఢమైన శిల్పం చూపిస్తాడు! ఇతని మాట కిటికీలాగ, తోటా, ఏరూ ఆకాశమూ, నడుమ ఒకరివైపు ఒకరు తిరిగి నిట్టూరుస్తూ నిలబడ్డ ఇద్దరు ప్రేమికుల్నీ అంతరాల్లోనుంచి ఎలాగ చూపిస్తుంది! 'వెంకి' అనక 'యెంకి' అనడం వల్ల ఒక వింత ఆకర్షణ వచ్చిందికాని భాషకూడా నండూరిదే. మరి కవిత్వపు లావణ్యాలూ, లోతులూ వేదులకి తెలిసినంత మరెవ్వరికీ తెలుసునా అని ఆలోచిస్తున్నాను. పాతమాటలే సరికొత్తవైపోయి, పాతవృత్తాల్లోనే

పడి, ఒయారంగానూ, ఓరగానూ, ఉద్వేగంతోనూ, ఉల్లాసంతోనూ ఊగుతూ ఊగుతూ ఇదివరకెరగని వనిపిస్తాయి. మరి వాటిలో వేదనా, భావనా కలిసిపోయి, దేని ప్రాబల్యమూ ఎక్కువ కాకుండా ఉత్తమ కావ్యమయి ఊరుకుంటాయి. 'దీపావళి' రోజుల్లో వేదుల ఎలాగ ప్రవాసిలాగ ఉండేవాడో నే నెరుగుదును.

వీరి ముగ్గురి కవిత్వంలో మానవహృదయం గొప్ప యెత్తులూ, లోతులూ అందుకుందని నా అభిప్రాయం.

ఇక మిగిలింది నేను. దేవులపల్లి కృష్ణశాస్త్రిని. పిఠాపురం దగ్గర కూచిమంచి తిమ్మకవి చంద్రంపాలెం మా ఊరు. తండ్రీ, పెద్దతండ్రీ మంచి పండిత కవులని ఆ రోజుల్లో పేరు పొందారు. ఆ పితృదేవుల్ని ప్రతినిత్యమూ స్మరించుకుంటూంటాను. మొదట పిఠాపుర సంస్థానానికి సన్నిహితుణ్ణవడంచేత, జీవితంలో భోగమూ, బద్ధకమూ ఎక్కువై కృషి తక్కువ. ఇంటి వద్ద అహరహాలు పూర్వకావ్యగోష్ఠి జరుగుతుండేది. కాకినాడలో వెంకటరత్నంనాయుడుగారి శిష్యుణ్ణయి మత సంఘసంస్కరణోద్యమాల ప్రభావంలో పూర్తిగా పడ్డాను. ఆంగ్ల సాహిత్యంతోనూ, సూఫీ వంగ వైష్ణవ సాహిత్యాల తోనూ నా గురుదేవుల ద్వారానే నాకు కొంచెం పరిచయం.

తరువాత హరిజనోద్యమంలోనూ, కళావంతుల వివాహోద్యమంలోనూ, మా ఊళ్ళో కొంత తిరిగాను. కొన్ని సంవత్సరాల పాటు నన్ను బంధువులూ, బ్రాహ్మణులూ బహిష్కరించారు. నా జీవితంలో అతి తీవ్రమైన వేదనా ఆవేశమూ కలిగించే గొప్ప అనుభవాలు కొన్ని వచ్చాయి. ఉద్యోగం ఎవరయినా ఇచ్చినా, అది ఉంచుకునే గుణం లేక, నవ్యకావ్యాలు చదువుతూ, నవ్యకవిత్వం మొదలైన వాటిమీద ప్రసంగాలిస్తూ కొంత తిరిగాను.

'కృష్ణపక్షము' 'ప్రవాసము', 'ఊర్వశి' కొన్ని గేయాల సంపుటులూ అచ్చయిన నా కావ్యాలు. వాటి ప్రభావమూ, ముద్రా

1925 తర్వాత నా తరువాతి కవులు చాలా మంది మీద కొన్ని యేళ్ళపాటు ఉందని అంటారు. కొంతకాలం నా మీద ప్రసరించిన దూషణభూషణలు నవ్యకవుల్లో మరెవ్వరి మీదా పడలేదు. కాని అన్ని తరాల కవులకీ నా మీద ఉన్నంత అనురాగము మరెవ్వరి మీదా లేదు. నన్ను సాటి వాడుగా వారందరూ ఆదరించడమే నా జీవితానికంతకీ వరం.

## 10

ఈ నవ్యకవితోద్యమం అంటే 1925 తరువాత ఎక్కువగా విజృంభించిన ఆత్మపరమైన కవిత్వానికి చెందినదని కొందరంటారు నా అభిప్రాయం ప్రకారం ఈ కవిత్వ గోపురం పునాది గురజాడవారే వేశారని 'పెరిగి విరిగితి' వంటి కావ్యంలో ! దానిమీద రాయప్రోలూ, బసవరాజూ కొంత నిర్మాణం సాగించారు. నాయని ప్రభృతులు శిఖరం కట్టారు. కాని మా కాలపు కవులందరూ ఆత్మాశ్రయమైన కవిత్వం కొంచెమయినా వ్రాశారు. మిగిలిన కాల్పనికోద్యమ (Romanticism) ప్రభావాలు కవులందరిమీదా ప్రసరించాయి. అసలు కొంత కాల్పనికావేశం లేకపోతే కవిత్వమే రాదని నా నమ్మకం.

కాని అది హద్దుమీరితే అగమ్యగోచర మవడమూ, ఆవిరి అవడమూ ఉన్నది. నిజానికి ఏ ఉద్యమం ముదిరినా ఏదో దుర్గుణం వస్తుంది. సాంప్రదాయికత (Classicism) తెగలాగితే శిలానియమశృంఖాలాలలో ప్రాణం పోతుంది. వాస్తవికత పెచ్చు పెరిగితే రంగూ రుచీ వాసనా పోతాయి. ఉత్తమ కావ్య రచనకి ఈ మూడు గుణాలూ కావాలి; ఎటొచ్చీ సరియైన పాళ్ళల్లో ఉండాలి.

"ఆత్మపరమైన కావ్యంలో ప్రయోజనం స్ఫుటంగా కనపడదు. ఎక్కువమందికి అందుబాటులో ఉండదు" అని కూడా అంటారు. ఇది నిజమే. జాతీయోద్యమ కావ్యాల్లోనూ, తరువాత సమష్టిమానవోద్యమపు కావ్యాల్లోనూ, ఎక్కువ మందిని ఆవహించే ఆవేశాలూ, అనుభూతులూ

కావ్యవస్తువులు కావడంచేత అవి ఎక్కువమందిని ఆకర్షిస్తాయి; ఎక్కువ త్వరగానూ ఆకర్షిస్తాయి. కాని ఉత్తమమైన ఆత్మాశ్రయ కావ్యంలో ఉన్నంత కవిత్వ లావణ్యము మరొక కావ్యంలో ఉండదు. ఊపినచోట ఊపినంత మరొకటి ఊపదు. అంతేకాక అది పఠించినవారి మనస్సు క్షాళితమై, ఫదునై పక్వమౌతుందనుకుంటాను. అది ప్రయోజనమే.

మానవకోటి అనే శరీరంలో ప్రతిజాతీ ఒక్క అవయవం; దానిలో ప్రతి మానవుడూ ఒక్కొక్క అణువు (Cell). ఈ అణువుకి వేరే ప్రాణమూ, ప్రయోజనమూ ఉన్నాయి. అవయవాలే గాక వీటిలో ఏది కుళ్ళినా శరీరానికే ముప్పు కనుక ఈ అణువుకి గొప్ప విలువ ఉంది. కనుక ఒక్కొక్క ముహూర్తంలో ఈ అణువు వంటి మానవునికి వచ్చే అనుభవం శరీరానికి అంతా అమూల్యమైనదే. అలాంటి అనుభవాన్ని ప్రకటించే కావ్యం ఆత్మపరమైనదైనా, అప్పటికి స్పష్టంగా అందకపోయినా, అందరికీ విలువైనదే" అని ఒకరు వ్రాశారు.

కనుక ఆత్మపరమైన కావ్యాన్నీ (Subjective poem) భావకావ్యాన్నీ లేక గేయకావ్యాన్నీ (Lyric) ఇంకొకరకం కావ్యం చేసేపనిని చేయమంటే ఎలాగ చేస్తాయి? ఈ గేయకావ్యంలో భాషా, భావమూ (Expression and the Expressed) ఒకటే; కొన్ని మాటలు ఒకరకం కూర్పులో కలియడం వల్ల వచ్చే విలక్షణమైన గానం వంటి దేదో, అట్టి కావ్యం చదవగానే, మనల్ని ఒక మనస్థితిలో పడేస్తాయి; మనకి ఒక ఆవేశం కలిగిస్తాయి. మనకు ఒక అనుభవం స్ఫురింపజేస్తాయి. ఈ కావ్యం మంచి గానం చేసే పని చేస్తుందని నా నమ్మకం. నవసాంఘిక విధానము సుస్థిరంగా రష్యాలో ప్రతిష్ఠింపబడిన్నది కనుక ఇప్పుడు ఆ దేశంలో భావకావ్యరచనని ప్రోత్సహిస్తున్నారని వింటున్నాం.

ఇక్కడ ఒక్కమాట! మా తరం కవులలోనూ, తరువాతి నవ కవులలోనూ ఏ ఒకరిద్దరో తప్ప మిగిలిన అందరూ అవిశ్రాంతంగా

కావ్యసృష్టి చేయక మూగతనం వహిస్తున్నారు. విశ్వనాథ ఆ ఒకరిద్దరిలోవాడు. ఇతని కవిత్వమూ, బ్రతుకూ ఒకటే అయిపోయాయి. ఇతనిది గొప్పదీక్ష. ఇక మిగిలిన కవుల కవిత్వంలోనే వుందేమో ఎక్కువగా రాయకపోయే గుణం! కాని యౌవనంలో ఆత్మపరమైన కవిత్వం చెప్పిన రవీంద్రుని వంటివారు, ఒక్కసారయినా కలం దించక కావ్యసృజన చేస్తూనే వుండలేదా?

కవితారచన కూడా తపస్సు. కవి ముదిరాక వ్రాసే కావ్యరూపమూ, గుణమూ మారవచ్చును గాని కావ్యకల్పన మానగూడదు. ఇలాగ మానడానికి కారణాలు అనేకం వుండవచ్చు; కాని ఒకటి ముఖ్యంగా నా మనస్సుకి తోచినది ఇక్కడ చెప్తాను. ఆ కొత్త రోజుల్లో, మేలుకొన్న కొత్త సమాజం లో తనకు లభించిన ఏ ఒకటి రెండు అనుభవాలనో, కష్ట సుఖాలనో కవి తన దివ్య కావ్యాల్లో పెట్టాడు. తరవాత అహంకారం వల్లనో, అశ్రద్ధవల్లనో ఆ అనుభూతుల్నే కౌగలించుకుని చుట్టూ ఆవరణకట్టి కూర్చున్నాడు.

ఇంతలో అతని నాటి మానవోద్యమపు రూపు మారింది. ఈ మార్పు కూడా తానూ కొంతవరకు తన కావ్యాలద్వారా తెచ్చిపెట్టినదే. నాటి సమాజం పెరిగింది. చైతన్య భాండారమై అనంతజీవంతో చలించిపోయే నవమానవ సమాజంతో కూడా నడుస్తూ వస్తూ స్నేహంచేస్తూ జీవిస్తే కొత్త అనుభవాలూ వస్తాయి; కొత్త కావ్యాలూ వస్తాయనుకుంటాను. ఎటొచ్చీ ఆ కావ్యరూపాలు మారవచ్చు, కథలు రావచ్చు; నాటకాలు రావచ్చు. ఆ కావ్యాల్లో వెనకటి లావణ్యం లేకపోవచ్చు; మహత్తర సందేశం ఉండవచ్చు. జీవితయాత్రలో ఒక్కచోట ఆగిపోవడానికి ఎవరికయినా అవకాశం ఉందికాని కవికి ఆ అవకాశమూ, అధికారమూ కూడా లేవు. ఈ సమాజం మనది; దానితో మనం మారాలి; దానిని మార్చాలి.

## 11

నవ్యకవితోద్యమంలో మా తరువాత వచ్చిన కవుల్ని గూర్చి కాస్త వ్రాస్తాను. వీరిలో కూడా కొందర్ని వదిలేస్తున్నాను, ఏం జెయ్యను?

విశ్వభారతిలో గురుకులవాసంచేసి కొత్తగా తెలుగు నాటిలో అడుగుపెట్టిన పుల్లవరపు విశ్వేశ్వరరావుకి స్వచ్ఛమయిన మంచి భావనాబలం ఉంది.

'ఏనాడు', 'గడ్డిపూవు' 'సింగారము' మొదలైన కృతులలో భాషా, నడకా, భావనా ఎంత ముగ్ధమోహనంగా నయినా ఉంటాయి. తరువాత 'కల్యాణ కింకిణి' లో మరికొంత పెరిగి ఆత్మపరమైన కావ్యాలు వ్రాశాడు; గేయాలు మహా బాగా వ్రాస్తాడు. కవిత్వ గుణాల్ని బట్టి ఇతను మా తరానికి దగ్గిర. పిలకా గణపతిశాస్త్రి కూడా అంతే సంస్కృతాంధ్ర సాహిత్యాలతో మంచి పరిచయం ఇతనికి ఉన్నది. తరువాత ఆంగ్ల సాహిత్యంతో కూడా. అసలు కవి కనుక, కొత్త గాలుల్ని తెలియకుండానే పీల్చి, గీర్వాణ పాఠశాలలో చదువుతున్న రోజుల్లోనే నవ్య కవితోద్యమంలో పడ్డాడు. ఇతనిది మంచి భావన; మాటలతో మంచి చిత్రాలు కట్టగలడు; ఆ మాటలూ వాటి కూర్పులూ వృత్తాల నడకలూ మనోహరంగా ఉంటాయి. వేడి వేడి అనుభవాలకి ఎదురుచూచే కవి హృదయం ఇతనిది. 'రత్నోపహారం', 'రురుడు-ప్రమద్వర' లో ఇతని శక్తి బాగా కనబడుతుంది. హనుమదింద్ర గంటి కూడా గీర్వాణ పాఠశాల నుంచి వచ్చినవాడే. కవిత్వపు లోతులు ఇతడు సమగ్రంగానూ, సూక్ష్మంగానూ గ్రహిస్తాడు. ఇతను వ్రాసిన కొద్ది ఖండ కావ్యాలలో మంచి కవిత్వ సంపద ఉంది. 'గోదావరి' ప్రశస్తమైన కావ్యం; ఇతని వాణిలో పదునూ, అందమూ కూడా ఉన్నాయి. బాల గంగాధర తిలక్ వీరికన్న బాగా చిన్నవాడు; ఇతని రచనల్లో కొత్తదనమూ, సోయగమూ కూడా ఉన్నాయి . 'సంపత్' మంచి దిట్ట. ఇతని చదువూ, సంస్కృతీ

సమగ్రమైనవీ, నిండైనవీ, అన్ని రకాల కవిత్వాలు బాగా ఎరిగున్న వాడు. రకరకాల ఛందస్సులలో రకరకాల ఖండకావ్యాలు వ్రాశాడు. ప్రాత ధోరణులన్నీ జీర్ణించుకుని కొత్తపోకడలలో పోయి ఒప్పగించగలిగినాడు.

జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి కూడాగీర్వాణ కళాశాలనుంచి వచ్చినవాడే. కవిత్వమూ, సాహిత్యమూ అంటే ప్రాణమిచ్చే మనిషి. పూర్వాంధ్ర కావ్యాలతోనే కాక, గురజాడ నుంచీ నేటికవి దాకా అందరి కావ్యాలతోనూ ఇతనికి అమిత స్నేహం. 'పేరడీ' అనే కావ్యరచనలో ఇతనికి అసాధారణ ప్రజ్ఞ ఉంది. ఒక్కొక్క కవితను ఒక్కొక్క కవి ప్రత్యేకధోరణిని పట్టుకుని, దానిని కొంత హాస్యం చేస్తూ, ఆకవిదనిపించేటట్లుగా నే కావ్యం వ్రాస్తే 'పేరడీ' అవుతుంది. ఇది తెలియకుండా చేసే అనుకరణం కాదు; తెలిసి తెలిసి అనురాగంతోనే చేసే హాస్యం. రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ ల కావ్యాలకి జలసూత్రం అద్భుతమైన పేరడీలు వ్రాశాడు.

శ్రీరంగం శ్రీనివాసరావు – అంటే శ్రీ శ్రీ – తో మానవోద్యమంలో రెండోతరం పొలిమేరల దగ్గరకి నవ్యకవిత్వం వస్తుంది. ఇతని మొదటి రచనలలో ప్రభవ అనే కావ్య సంపుటిలో తన వెనుకటి కవుల ప్రభావాలూ, ధోరణులూ కనపడతాయి. కాని వాటిలో ఒక ప్రతిభాశాలి ప్రత్యేకత కూడా గోచరిస్తుంది. అంతలో ఇతనికి మరొక మానవ లోకపుటంచులు దూరాన్నుంచి కనపడతాయి; ప్రజా పదధ్వనులు వినబడతాయి. తక్షణం ఇతని కావ్య వస్తువులూ, వాటితో కంఠధ్వనీ, బాణీ మారతాయి. శరీరమంతా ఒక ఆవరణలో నిలబడగా శిరస్సు చాపి మరొక ఆవరణలోనికి చూస్తున్నట్లుంటాడితను. ఇతని ఆవేశం కాల్పనికోద్యమానిదే; భాష కూడా అంతవరకు కావ్యభాషగా వస్తున్నదే; కాని దానితోనే కొత్త కాహళులవీ, దుందుభులవీ మ్రోతలు మ్రోగిస్తాడు; నవ కవిత్వావరణలో మరొక కవిత్వోద్యమానికి ప్రతినిధిగా నిలబడ్డాడు. ఇతని అనుయాయులు అనేకులు. ఇతడు శబ్దాలమీదా,

ఛందస్సుల మీదా అమోఘమైన అధికారం చెలాయిస్తాడు. ఆంధ్రాంగ్ల సాహిత్యాలతో అతి గాఢమైన స్నేహం ఇతనికి.

'పఠాభి' పూర్తిగా నవ్యుడు... 'ఫిడేలు రాగాల డజను'లో వచన మనే దుడ్డుకర్రతో 'పద్యాల నడుములు విరగ' గొడతాడు. ఇతని అతి నవ్యత వచన కావ్య రచనలోనే కాక పూర్తిగా నేటి నగరవాసుల అనుభూతులని కావ్యజగత్తులోనికి తీసుకుని రావడంలోనూ గోచరిస్తుంది. ఈ కావ్యాల్లో ఈ నాగరక వాసనలు ఎంత అద్భుతంగానయినా స్ఫురిస్తాయి. ఇతనిది మంచి భావన కూడా; పట్టణపుటాకాశంలో చంద్రుణ్ణి వర్ణించేటప్పుడూ నగర శృంగాటకంలో నిలబడ్డ పోలీసు జవానుని వర్ణించేటప్పుడూ ఈ శక్తి కనపడుతుంది. ఇతను ప్రాత ఛందస్సులన్నీ వింత ధోరణిలో గడసరిగా తరవాతి కావ్యాల్లో ఉపయోగించాడు.

శ్రీ శ్రీ తో ప్రారంభమైన ఉద్యమం అభ్యుదయ రచయితల ఉద్యమంగా దేశంలో 1945 ప్రాంతాలని పెరిగింది. ఈ ఉద్యమావేశంలో బుర్రకథలూ, పాటలూ వ్రాసేవారనేకులు వచ్చినా, ఏ యిద్దరు ముగ్గురో తప్ప కవులు రాలేదు, వీరిలో 'ఆరుద్ర' ఒకడు. ఇతను పూర్తిగా కొత్త ఆవరణలో నిలబడ్డవాడు. చురుకైన భావన ఉన్నది ఇతనికి. "మొయ్యోయ్, మొయ్యోయ్" వంటి మంచి గేయకావ్యాలు చాలా వ్రాస్తున్నాడు. కవిత్వ రహస్యం తెలిసిన వాడు; కనుక కావ్య నిర్మాణానికి అవసరమైన శిల్పం వదలుకోని గడసరి. మరి అనిశెట్టి, రమణారెడ్డి మొదలైన కవులు కూడా ఈ ఉద్యమంలోనివారే.

## 12

ఒకదారిని బట్టి పోతే, ఇదీ పాతిక సంవత్సరాల నవ్యాంధ్ర కవిత్వ చరిత్ర. మొదట నేననుకున్న చిక్కులన్నీ నన్నెదుర్కొన్నాయి. కొంతవరకు నన్ను లొంగదీశాయేమో కూడా. ఇది చరిత్ర, విమర్శ, ఏదీ కాకుండా పోయిందేమో ! కాని ఎక్కువగా నాకు బాధ కలిగించేదొకటి

ఉంది. ప్రబలులూ, సమర్థులూ అయిన కొందరు కవుల ప్రతిభా కృషులెటువంటివో వ్రాయనేలేకపోయాను. ఈ రచనలో కొందరి పేర్లు రాకపోవడము, కొందరిని గూర్చి విపులంగా వ్రాయలేకపోవడము వారికి లోపం కాదు. కాని నా మనస్సును మాత్రం కలత పెడుతుంది. అయినా నేను నడచిన త్రోవ వేరు; అలాగ నడుస్తుంటే ముందుకు తోసుకుని వచ్చి నన్ను పలికించిన వారిని గూర్చే ఇక్కడ వ్రాశాను. ఈ రచన నేను చేయవలసినది కాదు.

కాని ఒక హెచ్చరిక మాత్రమే నేనే చెయ్యగలను- ఆ హెచ్చరిక నాకే ఎక్కువగా అవసరం అవడం వల్లనున్నూ, నా యెడ అనురాగం చేత కవులందరూ దానిని ఆదరిస్తారు కనుకనున్నూ!

ఇక్కడ మన తెనుగు నాటిలో ఉన్న కవిత్వ శ్రీ మరి ఏ యితర రాష్ట్రంలోనూ లేదన్నాను కదా! కాని ఇక్కడే కవి అంటే సమాజంలో గౌరవాదరాలు తక్కువ అనుకుంటాను. పానుగంటివా రన్నట్లు ఒక కథ ఉంది. 'అయ్యా! నీ విప్పుడేం జేస్తున్నావు?" అని ఒక పెద్దమనిషి మరొకరిని ప్రశ్నిస్తాడు. "కవిత్వం చెప్పున్నానండీ" అని అతగాడంటాడు. 'భేష్! వైద్యం మానేశావన్నమాట! అయినా ఏదయితేనేం నలుగుర్ని చంపడానికి" అని ఇతను అంటాడు. సాధారణంగా ఇలాంటి స్వాగతమే ఎక్కడికి వెళ్ళినా కవులకు లభిస్తుంది. కనబడిన వాడల్లా, "ఏమండీ కవిగారూ, మా మిరపకాయల వర్తకం మీద నాలుగు పద్యాలు వ్రాయాలండీ" అని అడుగుతాడు. అంత లోకువయా డితగాడు ! "ఓ కవీ! నీ పాత ధోరణి మాను! కొత్త వస్తువుల్ని గూర్చి వ్రాయి" అని కవిని హెచ్చరిస్తూ ఒక పద్యం వంటిదేదో వ్రాసేవాళ్ళు, ఆ పద్యం కాస్తా ఆ వస్తువు మీద ఆ ధోరణిని తామే వ్రాస్తే బాగుండును!

అయినా ఈ స్థితిగతులకు కవి కూడా కొంతవరకు కారణమే! నిజంగా సమాజానికి నాయకుడు కవే. ఈ కొత్తయుగ సంధిలో మరీని! వెనుకటి కవి సమాజం ఇప్పుడు విశ్వమంత విశాలంగా పెరిపోతూంది;

ఆ సమాజంలోనివారూ, కవీ ఒకరితో ఒకరు మరీ పెనవేసుకుపోతున్నారు. కవి త్రికాలజ్ఞుడు; గరుత్మంతుని వంటి ద్రష్ట; దూరాలు చూస్తాడు; నాలుగు వైపులా చూస్తాడు. అసికొసలవంటి చూపులతో దొలిచి దొలిచి అంతరాంతరాలు చూస్తాడు; అకలంకమూ అమృత ప్రాయమూ అయిన అనురాగంతో చూస్తాడు. ఇక తరతరాల నుంచీ దిక్కు దిక్కులనుంచీ వచ్చిన విజ్ఞాన సంస్కృతులలో, సంప్రదాయాలలో అవసరమైనవీ, ఉత్తమమైనవి, ఏరుకుని అక్షయమైన దారి బత్తెం సేకరించుకుంటాడు. వర్తమాన దేశ కాల పరిస్థితుల్ని బాగా తెలుసుకుని ప్రయాణం బాగా సుఖంగా ముందకు సాగడానికి అనుకూలమైన మార్గాలూ, మజిలీలూ, ఏర్పరుస్తాడు. మరికొంతవరకయినా భవిష్యత్తులోనికి జూచి, "మన కడపటి గమ్యస్థానం అదీ" అని నిర్ణయించి చూపిస్తాడు. అనంతయాత్రా మార్గం మీద జనం యాత్రికకోటి; దానికి పెత్తందారు, నాయకుడు కవి!

ప్రజల్లో మునుపున్నట్లు ఇప్పుడు మూగవాళ్ళూ నిదురపోతులూ లేరు. ఆనాడు నేను నవప్రభాత ప్రాంగణంలో నిలబడి, "నేను మానవుణ్ణి కనుక నాకు స్వాతంత్ర్యానందాలు కావాలి, ఇవీ నా కష్టసుఖాలు వినండి" అన్నాను. ఈనాడు మూలమూలలా నిండుకొని ముదిరిన వెలుగులలో నిలబడి, "అబ్బ ! ఎందరున్నారో మానవులు! ఎందరో! వీరందరూ ఒకటే! నాకు కావలసినవన్నీ వీరందరికీ కావాలి" అనాలి నేను!

సమాజానికి దూరమై కొందరు కవులం నిర్జీవ రచనలు చేస్తాం. పాండిత్యమూ, ధీశక్తీ, ఉపజ్ఞా ప్రకటించడానికి కొందరం దురేయులం అవుతాం. అవేవీ బొత్తిగా లేక కొందరం వట్టి తుక్కూ దూగరా, గుడ్డీ, కుంటీ రచనలను విరజిమ్ముతాం. కొందరం కేవలమూ చమత్కారం, చురుకుదనం చూపించి మిడుమిట్లు గొలపబోయి వికాసమూ, ఆనందమూ ఇవ్వలేక పోతాం. కొందరం 'ప్రజలు ప్రజలు' అంటూనే ప్రజాలోకానికి దూరంగా ఉంటూ, దాని స్వరూపమూ,

సంప్రదాయమూ, కష్టసుఖాలూ, దాని జీవద్భాషా గ్రహించలేక, విజాతీయ సమాజంలో నుంచీ , విజాతీయ కంఠాలలో నుంచీ వచ్చిన రచన లను మన కంఠ ద్వారాల నుంచి వదులుతాం. కొందరం కేవలమూ కొత్తదనం చూపించి ప్రముఖులు కావడానికి ఉత్త ఓటిబొమ్మల చుట్టూ కొత్త దుస్తులను అతుకుతాం.

కాని మనలో కొందరు గొప్ప కవిబ్రహ్మలూ ఉన్నారు. జీవ వంతమైన సృష్టి చేసినవారూ, చేయగలవారూనూ! వీరందరూ, వెంకటశాస్త్రి మొదలుకొని అతినవ్యుని దాకా, ఒక మహాపరిషత్తులో సమావేశమయి, కవిప్రాజాపత్యము స్థిర పరుస్తే బాగుండును. ఆ మహామేళంలోనుంచి జగత్తంత మానవాలయం కట్టగల ఏ తెనుగునాటి వ్యాసుడు పుట్టుకొని వస్తాడో! అంతవరకూ నవ్యకవితోద్యమం సాగవలసిందే!

# అప్పుడు పుట్టి ఉంటే....

ఈ యేడు మహర్నవమినాడు రాయలవారు భువన విజయంలో మనుచరిత్ర మందుకుంటున్నా రన్న వార్త సామ్రాజ్యం మారుమూలలకీ పాకిపోయింది.

అటు కళింగం నుంచీ, గౌతమీ తీరాన్నుంచీ, ఇటు కావేరి నుంచీ, మధుర నుంచీ, కవీశ్వరులేమీ, గాయకులేమి, విద్వాంసు లేమి, ఎక్క డెక్కడివారూ విజయనగరానికి కొన్ని దినాలకి ముందుగానే వచ్చి విడిది చేశారు. ప్రభాత సమయంలోనూ, ప్రదోష కాలంలోనూ, తుంగభద్రా తీరాన్నీ విఠల స్వాముల కల్యాణమండపంలోనున్నూ వీరందరి గోష్ఠులూ ఎంతో కలకలం చేస్తున్నాయి.

కొంత కనుచీకటి పడ్డాక, ఈ విద్వత్కవులలో కొందరు రసికులు సాహసించి, పగలు తిరగడానికి వీలులేని వాడల్లోకి చొరబడడమూ జరుగుతుంది.

అప్పాజీ, సాళువ తిమ్మరు సయ్యవంటి సామంతుల గృహాంగణాలు ఈ యేడు ఉన్నంత సందడిగా అదివరకు ఎప్పుడూ లేవు.

ఇక, వచ్చిన కవులలో సగం మంది పెద్దన్న గారి ఇంటనే దిగారు. పింగళి సూరన్న ఎప్పుడు విజయనగరం వచ్చినా, తాతగారి ఇంటనే దిగడమూ, తన కవిత్వ ధోరణి ఆయనకు వినిపించి రంజింప జేయడమూ ఉండనే ఉంది. ఆనాటి ఉదయం నుంచీ అతడు వాకిట్లో నుంచి లోపలికీ, లోపలి నుంచి వాకిటిలోకీ తిరుగుతూనే ఉన్నాడు.

... ... ...

అంతలోనే వీథి మొగను కాహళధ్వనులు మోగుతాయి గుఱ్ఱపు గిట్టల ధ్వనులతో కలిసి.

అంతలో, ముందు ఇద్దరూ, వెనకాల శకటంలో అప్పాజీ, మహాకవి మందిర ప్రాంగణంలో దిగుతారు.

సూరన్న ఆవేశానికీ, సంతోషానికీ మేర లేదు.

పెద్దన్న గారు వాకిట్లోకి వస్తారు. గడియకో, మరో గడియకో రాయలవారు అక్కడికి వేంచేస్తున్నా రనిన్నీ, ఊరేగింపు మహోత్సవం అక్కడినుంచి తరలి ఆ కొలువు కూటం దాకా సాగుతుందనిన్నీ, మహాకవులతో అప్పాజీ మనవి చేస్తాడు.

బంగారు కుండలాలూ, జలతారు సేలువలూ సవరించుకొని, కవులూ, పండితులూ రాయలవారి రాకకై మొగసాలలో ఎదురు చూస్తుంటారు.

ఇంతలో మంగళవాద్య ధ్వనులు మరీ మోగి పోతాయి.

మహారాజ ప్రాసాదం నుంచి రాయలవారు బయలుదేరినట్లు, కొంతదూరం వచ్చినట్లు, మరికొంత సమీపించినట్లు, సేవకులు పరుగెత్తివచ్చి చెప్తూంటారు.

మరి ఇక కొంత సమీపించినట్లు, మొదట వర్షామేఘ గర్జనలాగ, తరువాత మహాసముద్ర ఘోషలాగ, విజయనగర ప్రజలు చేసే జయజయ ధ్వానాలు దగ్గిరగా దగ్గిరగా వినబడతాయి.

అంతలో వీథీ ముఖాన సందడి, ఒక కనురెప్పపాటు నిశ్శబ్దం.

రాజాధిరాజ వీరప్రతాప రాజపరమేశ్వర మూరు రాయరగండ శ్రీకృష్ణదేవ రాయలు అల్లసాని పెద్దనామాత్యుల గృహాంగణంలో, మంత్రి సామంతులతో వేంచేసి ఉంటారు. ముందు అప్పాజీ అచ్యుత దేవరాయలూ సంది తిమ్మన్నా మాదయ్యగారి మల్లన్నా నడుస్తుంటే పింగళి సూరన్న చెయ్యి అందుకుని వచ్చి బంగారపుటడ్డల పల్లకీలో పెద్దన్న గారు కూర్చుంటారు.

మంగళ వాద్యాలు మ్రోగుతూనే ఉంటాయి.

అంతలో కవిరాజరాజు శ్రీకృష్ణదేవ రాయలు ముందు నిలబడి, పల్లకీ తన చేతితో ఎత్తుతాడు.

తక్షణం కొందరు సామంతులూ, కొందరు కవులూ పల్లకీ బొంగులకు భుజాలు తగిలిస్తారు.

"ఆహా, ఏమి మహాప్రభువు ! ఓహో, భోజుడేనా ఇలాగ చేశాడని విన్నామా! విద్వజ్జనుల పరిశ్రమ విద్వాంసులకే తెలుస్తుందన్నట్లు, మహాకవుల గొప్పతనం మహా కవులకే తెలుస్తుంది," అంటూ, నంది తిమ్మన్నా ధూర్జటీ మొదలైన కవీశ్వరులు ఆ గౌరవం తమకి జరిగినట్లే సంతోషిస్తారు.

సందడిలో కొంత వెనక్కి జరిగి, దిట్టలైనవారే కొందరు కవులు పెదవి విరిచి ధుమధుమ లాడుతూ ఉంటారు. వారిలో సంకుసాల నృసింహకవి ఉన్నాడా? అయినా ఈ ఆనంద సమయంలో వాళ్ళ పేర్లు ఇప్పుడు చెప్పను.

... ... ...

ఆహా ! ఏమి ఊరేగింపు.

ముందు వందలకొద్దీ రౌతులు. తర్వాత సుఖంగా, చల్లగా పాడె తంజాపుర సన్నాయి కూటం. ఆ తరవాత, ఒకసారి నరాలకి

వేడెక్కించీ, ఒకసారి కళ్ళల్లో మెరుపులు పుట్టించే, భట్టుకవుల స్తుతి పాఠాలు. పిమ్మట కంచి నుంచి వచ్చిన కామసుందరి మేళం ఆ వెనక వేద మంత్రాలు పఠించే వైదికబృందం ఆ వెంటనే మంత్రులతో, సామంతులతో, దండనాథులతో, కవులతో, పండితులతో, గాయకులతో రాయబారులతో, శ్రీ కృష్ణదేవరాయలు.

వారిలో, అడుగో, ఆ వృద్ధతేజస్వి అప్పాజీ, నిప్పుకణాలలాగ, కత్తి మొనలలాగ ధగధగలాడే రెండు కళ్లూ, వేయికళ్లుగా నాలుగువైపులా పరికిస్తూ!

ఆ విశాలమైన ఛాతీ, బుజాలూ, బుగ్గమీసాలూ, సాళువ తిమ్మరసయ్య.

కోటేసినట్లు చక్కని ముక్కూ, పండుతమలపాకు వంటి శరీరచ్ఛాయా, కర్పూరపు తాంబూలం బుగ్గలో ఉంచే, ఠాయల వారితో మాట్లాడుతూ నడుస్తున్నవాడు నంది తిమ్మన్న.

ఆ ప్రక్కన నిష్కళంకమూ, నిశ్చలమూ అయిన చల్లని ముఖంతో ధూర్జటి.

అతని వెనకాలనే, మొలలో నుంచి బంగారపు పొడుంకాయ తీస్తున్నవాడు మాదయగారి మల్లన.

ఆయనకి ఎడమవైపున ఆ అపరంజికుండలాలూ, ఆకుపచ్చ సేలువా రామభద్రుడు. అతనికి కుడివైపున ఆ చక్కని జిలుగు పట్టు వలువలతో తీరిచిన కురులతో ముంగురులూ అలవోకనడకతో, ఆ యువకవి రామరాజ భూషణుడు.

అతని పక్క కందుకూరి రుద్రయ్య.

అతను వంగి వంగి, తల ఒకపక్కకు ఓరగా వంచి, మాట్లాడుతున్నాడే, ఒక యువకునితో, అతను రామలింగ కవి; ఇంకా రామకృష్ణకవి కాలేదు. అతని నడకలో ఏమి నిర్లక్ష్యం! ఆ విశాల

ఫాలమూ ఒక్కసారి మేఘాల్లాగా, ఒక సారి మెరుపుల్లాగా. అయిపోయే ఆకళ్లా "శారదనీరూపము" అన్నట్లు ఎలా గున్నాడో !

అతని వెనుక రాధామాధవ కవి, ఎల్లన.

అదుగో, వెనుకనుంచి తొందరగా ముందుకు తోసుకుని భట్టుమూర్తి వద్దకు వచ్చినవాడు బండారు లక్ష్మీనారాయణ. రాయలవారి అంతఃపురంలో సంగీతపు గురువు. అతని చేతిలో గ్రంథం "సంగీత సూర్యోదయం" ఏమో!

అతనితో కూడా వచ్చినవాడు బయకారపు-రామయామాత్యుడు అనే గాయకుడూ దండనాథుడూ "స్వరమేళ కళానిధి" ఆస్థాన గాయకులకు వినిపించడానికి వచ్చినవాడు.

అల్లదుగో, కొంచెందూరాన నడుస్తూ, ఏదో ఆలోచిస్తున్నట్లూ, వ్యూహం పన్నుతూ ఉన్నట్లు, వేళ్లు తిప్పుతూ వస్తున్నవాడు బొడ్డుచర్ల తిమ్మన్నగారు. ఇటువంటి చతురంగపు టాటగాడు ఆ దినాల్లో లేడు. కవీశ్వర దిగ్దంతు లనుపించుకొన్న కృష్ణరాయలవారి యొద్దకుపోయి, వారితో చదరంగం ఆడుతూ ఉండే. ఈ చిన్న తిమ్మన్నగా రంటేనే, మహారాయలు చాలా సంతోషించి, కొప్పోలు గ్రామం సర్వాగ్రహారంగా ఈయనకు ధారవోసి ఇచ్చారు.

ఇతని ప్రక్కన ఆ పొడుగాటి జుట్లూ, ఆ రంగురంగుల దుస్తులూ వాళ్లూ నట్టువ నాగయ్య నట్టువ తిమ్మయ్యగార్లు, రాయలవారి సమక్షాన రాయలవారే రచించిన సంస్కృత నాటకం జాంబవతీ కల్యాణం ప్రదర్శించడానికి వచ్చారు.

ఇక ఆ పండితకూటంలో వారే, గీర్వాణ కావ్యకర్తలు దైవజ్ఞ విలాస కావ్య కర్తలు కొండవీటి విద్వత్కవి సార్వభౌములు లక్ష్మీధరులవారు. వారు వ్యాసతీర్థులు. అతడు రాజనాథ డిండిముడు. "ఇరుసమయ విళక్కన్" రచించిన తమిళ కవిరాజు, హరిదా సతడు. అతని పక్కనే రాయలవారి ఉత్కళయాత్రను వర్ణించిన కుమార సరస్వతి. చాటు

శీతలనాథుడు ఆ కర్ణాటక కవి. ఆ తేజస్సులిద్దరూ, పురందర దాసూ కనకదాసున్నూ, కర్ణాటక కవిరాజులు కలిసి నడుస్తున్న ఆ ముగ్గురూ - గుబ్బి మల్లనార్యుడూ, నంజుడయ్యా, లింగ మంత్రీ.

ఓహో, ఓహో, ఆంధ్ర కర్ణాటక తమిళ సాహిత్యాలకు స్వర్ణయుగం అది.

దక్షిణాపథం అంతా ఒక సుందర సంస్కారబంధం కట్టి పెట్టిన దినా లవి.

... ... ...

ఊరేగింపు వీథి తిరుగుతుంది.

వీథి దాటినదాకా ఇక్కడ పెద్దన్నగారి గృహ ప్రాంగణంలో గవాక్షంలోనుంచి, వెయ్యికళ్లతో చూస్తూ, గర్వమూ, అడకువా మూర్తికట్టినట్లున్నదే. ఆమె, మహాకవి ఇల్లాలు.

ఊరేగింపు విజయనగర రాజవీథుల్లో ఏలాగున సాగిందో తోవలో రాయలవారికీ మహాకవికీ హారతులు ఎలాగ ఇచ్చారో, శ్రీ శఠకోపయతుల మఠం వద్ద పల్లకీ నుంచి దిగి, కవీ, రాజూ, గురుదేవ చరణాలపై ఎలాగ శిరస్సులు ఉంచారో భూలోక దేవేంద్రుల సుధర్మాస్థానంలో, నిండోలగంలో, మనుచరిత్రము ఎలాగ పెద్దన్న గారు పఠించారో పఠిస్తున్నప్పుడు, "ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వని కుమారతకు క్రౌంచాచల రాజ మయ్యె" అన్న పద్యంతో గద్గదిక ప్రారంభమై "హితుడవు, చతురవచోనిధి వతుల పురాణాగమేతిహాస కథార్థస్మృతి యుతుడ వాంధ్ర కవితా పితామహుడ వెవ్వరీడు పేర్కొన నీకున్" అన్న పద్యం దగ్గిరకి వచ్చేసరికి మహాకవి కంఠం రుద్ధమై ఎలాగ చదవలేక పోయిందో తర్వాత, పఠనానంతరం, కవిపండితులందరూ ఆంధ్రకవిత్వ చరిత్రలో నవయుగం మనుచరిత్రతో ప్రారంబమైనదని ఎలాగ కీర్తించారో ఎప్పుడూ ఎవ్వరినీ పూర్తిగా కీర్తించని తెనాలికవే పెద్దనా మాత్యులకు పాదాభివందనం ఎలాగ చేశాడో

ఈ గాథంతా నాటి సాయంకాలము అల్లసాని వారి ఇంట్లో కూర్చున్నవారందరికీసూరన్నమరీ మరీ వర్ణిస్తున్నప్పుడు, ఆ ఇల్లాలూ తిరుగుతూ, ఆగుతూ వింటుంది.

ఆ రాత్రి, భార్యా, సూరన్నా, తానూ, ముగ్గురే కూర్చున్నప్పుడు పెద్దన్న గా రొక విశేషం చెప్పారు.

ఉదయం సభ అయిపోయిన తరవాత రాయలవారి రహస్య మందిరంలోకి రమ్మని పెద్దన్నగారికి పిలుపు వచ్చింది. ఆయన వెడతాడు. వెళ్ళేసరికి రాయలవారు నిలబడి ఉంటారు. మహాకవి రాగానే మహారాయలవారు ఆయన్ని తన కౌగిలింతలో గాఢంగా హత్తుకుంటాడు. ఇద్దరి కళ్లల్లో ఒక్క చినుకు కరిగి బుగ్గలమీదికి జారుతుంది. రాయలు మాట్లాడ లేదు. కవి మాట్లాడలేదు. రాయలవారు అంతఃపురంలోకి వెళ్లిపోతారు. అల్లసాని వారు ఇంటికి వచ్చేస్తారు.

ఈ గాథ వింటున్నప్పుడు సూరన్న బుగ్గలు తడిసి పోయేయి.

పెద్దన్న గారి భార్య మనస్సు ఎలాగుందో?

మరునాడు కవులందరికీ అల్లసాని వారి ఇంట విందు.

పెద్దన్నగారి భార్యను చూచి, "వండ నలయదు వేవురు వచ్చిరేని అన్నపూర్ణకు నుద్ది యీ నతని గృహిణి" అంటాడు రామకృష్ణకవి. "మా అక్కగారు ప్రవరుని గృహిణి వంటిదే; కాని మా బావగారు మాత్రం ప్రవరుడు కాడు; మాయాప్రవరుడు కాని" అని వెంటనే తిమ్మకవి అంటాడు. అందరూ నవ్వుతారు. "అవునా"? అన్నట్లు పెద్దన్న ఆమె వైపు చూస్తాడు. ఆ అదితిదేవి చిరునవ్వుతో వడ్డిస్తూనే ఉంటుంది. రామకృష్ణకవి కళ్ళు మెరుస్తాయి.

తర్వాత, పెద్దన్నకు ప్రవరుని మీద కన్న వరూధిని మీద ఎక్కువ ఇష్టం అనీ వరూధినినీ గంధర్వుణ్ణి కలిపిన తెనాలి కవిగారికి

తోచలే దనీ, అంతగా వేటా యుద్ధమూ ఎలాగ వర్ణించారండీ, రాయలవారితో వెళ్లినప్పుడు చేసేరా అనీ, "ఈ నగరంలో వరూధిని ఏ వీథిని ఉందో చూడాలి, అంత జీవం ఉట్టిపడుతున్నట్లు మాట్లాడిందనీ," "వరూధిని ఎవరో తెలిసినా, ఆమెకిప్పుడు తాతగారి వయస్సే దాదాపు ఉంటుంది, గనక మీకు లాభం లేదనీ" ఇలాగ రకరకాలుగా కవులందరూ మాట్లాడతారు ఎక్కువ మాటలు సూరన్నవి. మధ్య మధ్య ఒక్కొక్క మెరుపు రామకృష్ణ కవిది.

అవి గొప్ప రోజులు, ముఖ్యంగా కవులకు.

మరి కొన్నాళ్లు జరిగాక, రాయలవారే, వారి మందిరానికి కవుల్నందరినీ ఆహ్వానిస్తారు. పారశీక రాయబారులు వస్తారు. వారి వల్ల కానుకలు గొంటారు. తరువాత రాయలు "ఆముక్తమాల్యద" వినిపిస్తారు. ఆ వైదుష్యానికీ, ఆ ప్రతిభకీ, ఆ నవ్యతకీ, ఆ లోకజ్ఞతకీ అందరూ ముగ్ధులౌతారు.

ఆ రాత్రి నంది తిమ్మనగారి ఇంట రాయలవారి మహా కావ్యాన్ని ప్రశంసిస్తూ, రామకృష్ణకవి

"ఆ నిష్ఠానిధి" గేహసీమ నడిరే యాలించినన్ మ్రోయు, నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలున్ దివ్యప్రబంధాను సం
ధానధ్యానము నాస్తి శాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పా నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్యమన్మాటలున్".

అన్న పద్యం ఉత్సాహంగా చదువుతాడు.

రామకృష్ణకవి అసాధ్యుడు. సూరన్న కూడా. ఒక్క సారి వింటే మంచి పద్యం వీళ్లిద్దరికీ కంఠస్థంగా వస్తుంది.

పెద్దన్న, తిమ్మన్న, ధూర్జటి, మల్లన్నగార్లకిన్నీ వీరిద్దరూ యువకులే అయినా, వీరి అభిరుచి అంటే చాలా గౌరవం. ఈ యువకవులు మెచ్చుకుంటే కలిగే ఆనందం వాళ్లకు ఏ పండితులు మెచ్చుకున్నా కలిగేది కాదు.

ఒక సాయంకాలం తుంగభద్రా తీరాన్ని పెద్దన్నగారు మొదలుకొని కవులందరూ సమావేశమౌతారు.

విరూపాక్షస్వామి ఆలయ శిఖరం మీద బంగారపు కాంతులు అల్లుకుని ఉంటాయి.

తుంగభద్ర కాస్త ఒళ్లు విరుచుకుంటూ కునుకుపట్టే ముందులాగ కూనిరాగం తీస్తుంది.

పంపా సరోవరం నుంచి కాబోలు లేతగాలులు వచ్చి విజయనగరంలో చొరబడుతున్నాయి.

తుంగభద్రలో దిగి, తామ్ర పాత్రంలో నీరు నింపుకుంటున్న ఒక యువతిని చూచి, రుద్రయ కవి తూలిపడి కూర్చుంటారు. కూర్చుని ఆమె వైపు చూసి,

ఎన్నడు నేరిచెన్ బెళుకు లీచెలి కన్నులు ! కారు కమ్మల
న్నన్న కురుల్! పిరుందు పటుబైపటువైఖరినాప్రెడింగదా!
మొన్న గదమ్మ పిన్నమొనమొల్కాలు, నేడివె ముద్దులాడిలే
జన్నులు గొప్పవై పయటసందున దాగుడుమూతలాడెడిన్!

అందరూ భేష్ భేష్ అంటారు. సంకుసాల ఆ మెప్పులు సహించలేడు.

యతిపటుడు గాక పోవునే అస్మదీయ
కావ్యవై రాగ్య వర్ణ నా కర్ణనమున !
విటుడు యతి కాకపోవునే వెస మదీయ
కావ్య శృంగార వర్ణనా కర్ణనమున !

అని అహంకారంతో చదువుతాడు.

అతన్ని హేళన చెయ్యడానికి లాగ ఆవంత ఆసీ అనని కొంటె నవ్వుతో బడాయిగా నిలబడి.

లింగనిషిద్ధ కల్వల చెలింగని, మేచకకంధరున్ త్రిశూ
లింగని, సంగతాళి లవలింగని, కర్దమ దూషితన్ మృణా
లింగని, కృష్ణ చేలుని హలింగని, నీలకచన్ విధాత్రునా
లింగని, రామలింగ కవి లింగని కీర్తి హసించు దిక్కులన్

అని తెనాలి కవి జబ్బలు చరుచుకుంటూ చదువుతాడు.

ఇంతలో సాయంకాలం సంధ్యాసమయంగా మారుతుంది.

భట్టు మూర్తి గొంతు సవరిస్తాడు. చటుక్కున తుంగ భద్ర గలగల మంటుంది. ఆ అలల్లో ఏదో కదులుతుంది. గిరక ఒడిలో బిడ్డలాగ.

"జలకము లార్చి, పాండు జలజచ్ఛద పాళిక గప్పి తమ్మిసం
కుల తెలిదేనె లుగ్గులిడి, క్రౌంచరగల్ కదలించు లేత తొ
ట్టెలల కుమారు కూతును ఘటించి భజించు నదీలలామ, కో
మల కుముదా గతాళికుల మంజురవంబున జోలపాడుచున్".

అంటూ చదువుతాడు అందరూ హోయి హోయి అంటారు.

రామకృష్ణకవి "ఏది సంగీతం లేకుండా కాస్త ఆ పద్యం తిరిగి చదువు" మంటాడు. భట్టు మూర్తి మళ్లీ చదువుతాడు. భేష్ అంటారు అందరూ.

సంధ్యరాత్రిగా మాసిపోయినా, ఆ రోజున కవులు ఒక పట్టాన కదల లేదు.

"ఇప్పుడు రాయలవారు ఏమి చేస్తుంటారో" అంటారు ఒకరు. "ఈ రాత్రివేళ ఏం జేస్తుంటారని చెప్పను? ఎక్కడ ఉంటారని చెప్పను?

భోజకన్యా సరిద్రాజహంసము, సత్య
భామా శుకీకేళి పంజరంబు,
జాంబవతీనిశా చంద్రోదయంబు, కా
ళిందీ సరోజి నేందిందిరంబు,

భద్రా కలాపినీ ప్రావృడంబుదము, సు
దంతా రసాలలతా పికంబు,
మిత్ర విందావనీ చైత్రాగమము, లక్ష
ణాహార యష్టిక నాయకంబు,
షోడశ సహస్ర కామినీ స్తోమధేను
కా రిరంసా మదోత్కట వారణేంద్రము"

అంటాడు తిమ్మ కవి.

అనగానే ప్రక్కన ఘల్లుమని నవ్వుతున్న నవ్వు విన బడుతుంది. అందరూ తూలిపడతారు. రాయలవారే యేం చెప్మా ! ఏమో!

దక్షిణదేశానికి సార్వభౌములు మారువేషంతో తనకు ప్రియతములైన ప్రజలకోసం తిరుగు తా రని ప్రతీతి.

ఈ కవులకన్న ఆయనకు ప్రియు లెవ్వరు ?

అప్పుడు పుట్టి ఉంటే, ఇవన్నీ చూసేవాణ్ణి కదా. ఎందుకు చూడను? అప్పుడు పుట్టి ఉంటే, నేనే పెద్దన్ననై పుట్టి ఉందును !

# బసవరాజు అప్పారావు మధురస్మృతి

"ఈ ప్రవాస యాత్రారతి ఇటులె నేను
గదలిపోవుదు నాశావకాశములను,
ఒక నిట్టూర్పు వోలిక, ఒక్క మౌన
బాష్పకణమటు ఒక గాధ వాంఛపగిది"

కొన్ని స్మృతులు మంచులో కొండలలాగ కలిసిపోయి కంటికి దొరకవు. కొన్ని స్ఫుటంగా నిలిచి కనబడుతూనే ఉంటాయి. వెనుకనున్న ఆకాశం మీద చిత్రింపబడ్డ తోపుల్లాగ మరికొన్ని గాఢంగా స్ఫురిస్తూనూ ఉంటాయి. స్థూలంగా దొరకనూ దొరకవు, వేసగి వేకువలో గాలి తరగలాగ, ఆ గాలి తరగపైన కలిగొట్టు పూలవాసనలాగ.

అప్పారావుకు సంబంధించిన స్మృతులు మూడవ రకానివి.

ఎంతకూ చల్లారని కోరికలాగ కనబడతాడు నా కెప్పుడూ అప్పారావు ఊరికే నిట్టూరుస్తూ ఉండే గుండెలాగ.

అతన్ని తలుచుకుంటే ఒకటి రెండు స్పష్ట సంఘటనలు గోచరించినా, ఎక్కువగా స్ఫురించేవి ఏవో ఆవేశాలూ, అలజడులూను, నలుగురమూ కలిసి కూర్చుని మాట్లాడుకునేటప్పుడు కూడా, ఒక్క నిముషము ఒక్క చోటనే కూర్చోలేకపోయేవాడు. అక్కడి నుండి

ఇక్కడికీ, ఇక్కడినుండి అక్కడికీ పచారుచేస్తూనూ, అంతసేపూ మాట్లాడుతూనూ అప్పుడప్పుడు పాడుతూనూ, అడపా దడపా త్రుంచి త్రుంచి నవ్వుతూను.

దాదాపు నలభై ఏళ్ళక్రితం నాకూ బసవరాజుకూ నెయ్యమేర్పడింది యెంకి పాటల కవిద్వారా. సుబ్బారావూ నేనూ కాలేజీలో చదువుకునే వాళ్ళం. అప్పుడు అద్భుత రసంతో నిండిన మా మనస్సులకు అపరిచితమైన అమర లోకంలో నుంచి అవతరించిన వాడులాగ కనపడేవాడు అప్పారావు.

ఏమి రోజులవి! అప్పటి మా మనస్సులు ఎప్పుడూ రెక్కముడుచుకోవడం లేదు. అప్పుడుమాకు గూడు లేర్పడలెదు. ఒకరి రెక్క అంచు మరొకరి రెక్క అంచుకు తగులుతూ ఉంటే, ఎగురుకుంటూ పోవడమే ! నేలా, ధూళీ పిలుస్తుంటే మాకు వినబడేది కాదు. అంతేనా! ఒకరిగుండె మరొకరి గుండెలోనికి ఒలకబోసుకునే వారము ఆలపాలకడవల్లాగ.

అప్పటికి గడసరితనం వచ్చి కాలుష్యమూ, కీర్తి కామమూ మమ్మల్ని మనుష్యుల్ని చేయలేదు.

అప్పటికే బసవరాజు కవితాంగణంలోనికి అడుగు పెట్టేశాడు. మేమిద్దరమూ అంటే నండూరీ నేనూ, అప్పుడప్పుడు లోపలికి తలలు పోనిచ్చి తొంగి చూస్తుండేవారము.

మరి నాలుగేళ్ళయాక మరీ గొప్పరోజులు వచ్చాయి, తిరునాళ్ళ వంటివి. కాకినాడలో ఒక పదిమంది సాహితీ పరులం చేరాము; ఒకటే కావ్యగోష్ఠి . పగలల్లా ఇంట్లోనూ; సాయంకాలమూ మునిమాపూ కొంతరాత్రీ ఊరి వెలుపల ఇసుక బయలుమీద.

ఒకరికి "గుండె గొంతుకలోన కొట్లా" డింది. ఒక "రాకులో ఆక" యారు. ఒకరు చందమామను "పట్టి ముద్దా" డారు. ఒకరు "శిథిల వీణను నా పై త్రోయక నీవే పాడుకొ" మ్మన్నారు.

బసవరాజు ఆ గోష్ఠికి ప్రాణం. ఊరికే మాట్లాడేవాడు, **Wordsworth** అనీ, **Wattsdunton** అనీ,పండిత రాయలనీ, భవభూతి అనీ, తిక్కన్న అనీ, పోతన్న అనీ ! ఊరికే పాడేవాడు గురజాడవారి ముత్యాలసరాలూ, తన సెలయేటి గానములోని పద్యాలూనూ.

వాటిలో ఈ పంక్తులు నాకు బాగా జ్ఞాపకం; అప్పుడు గుండెకు రగులుకుని కుతకుత పొరిగేవి.

> "ప్రేమకుంగల్గు కారణం బేమనగల ?
> మింతిరో నిన్ను జూడ ప్రేమించుకొనుమి!
> ఇంతియేగాని వేర్వేర నెంచి చూచి
> అందపుం దళుకులనె ప్రేమ నందగలమె?
> తెలియు మాత్మను ఆత్మను కలిపి కుట్టు
> దారమే నాదు ప్రేమకు కారణమని"

అప్పారావు అలా పాడుతుండగానె అందుకునే వాడు సుబ్బారావు; రివ్వుమని తారాజువ్వలాగ గొంతువిసిరేవాడు.

ఆ రోజుల్లో నండూరి గొంతు కొండవాగు. గలగలలూ గంతులూ, సుడులూ వడులూ–ఒక చోట పుట్టి, ఒక దారిని సాగి ప్రవహించి, ఒకచోట కలిసిపోయేది.

సుబ్బారావు పాట నిభృతసుందరం; అప్పారావు పాట నిసర్గమనోహరం.

బసవరాజు పాటలో శక్తివేరు. చెప్పేనుకదా– అతను నిట్టూర్పు; అతని కావ్యం నిట్టూర్పు; అతని పాట కూడా వేడి వేడి నిట్టూర్పు.

కంఠం త్రుంపి త్రుంపి నాలుగుసార్లు మ్రోగించేవాడు తునకలు తునకలుగా అది మమ్మల్ని పిలిచి పిలిచి, దగ్గరగా వచ్చి వచ్చి మా గుండెలోనికి ఒదిగి ఒదిగి, తల నక్కడ ఆనించి, ఒక్కొక్కప్పుడు కుమిలి కుమిలి, ఒక్కొక్కప్పుడు వెక్కి వెక్కి ఏడుస్తూ, కష్టసుఖాలు

చెప్పుకునేది. అతని పాటకు నెత్తురుజీర అంటుకున్నట్లుండేది, బ్రతుకులోనుంచి బ్రద్దలు చేసుకుని ఒరుసుకుని వచ్చినప్పుడు అంటుకున్నట్టు.

ఆ వేగమే, వేదనే, అతని కవిత్వానికి ప్రాణం.

కాస్త గాలి కదిలితే, తగిలితే, ఒక్కొక్క ఆకే కదిలి, అన్ని ఆకులూ కలిసి, అంతా నిలువునా ఒక పాటయైన రావి చెట్టులాగ ఉండేవాడు బసవరాజు.

అందుకనే ముప్పయి తొమ్మిదేళ్ళలో నూరేళ్ళ బ్రతుకు అతనికి క్రిక్కిరిసిపోయింది, సుఖాలూ, దుఃఖాలూ, రాగద్వేషాలూ, ఆలింగనాలూ, అసూయలూ, శిఖరాలూ, అగాధాలూనూ, ఇంత అనుభూతి వస్తే, ఇంత చిరుగీతి!

"ఇంత చిరుగీతి యెద వేగిరించు నేని
పాడుకొనును, తాండవనృత్య మాడుకొనును"

అతను కవిత్వాన్నే బ్రతికాడంటారు కవిమిత్రులు కొందరు. అతని కావ్యాలకన్న అతని జీవితంలోనే కవిత్వం ఎక్కువ దొరుకుతుందని మరికొందరంటారు.

అలాగనడం కన్న అతని కావ్యాలూ అతని జీవితం ఒకటే నంటాను నేను.

"సెలయేటి గానం" "గీతాలు" అతని రచనలన్నీ కలిసి అతని జీవితగాథ అయింది.

ఇంక అతనికి అనుభూతి రావడమేమిటి, పాటలోనో, పద్యంలోనో అనెయ్యడమేమిటి ! అందుకే అతని గీతాలలో అంత వేడి. పాటలో పల్లవి వచ్చేసరికి గుండె పట్టుకుంటుంది. వినేవాడి చేయి గట్టిగా పట్టుకుని ఎదురుగా కూర్చుండబెట్టుకుని "నీవే, నీవే నా స్నేహితుడవు కనుక, మనమిద్దరమే ఉన్నాము గనుక, చెపుతున్నాను

సుమీ!" అన్నట్లు ఉంటుంది.

"న న్నెవ్వ రాపలే రీవేళ
నా ధాటి కోపలే రీవేళ"

అని మొదలు పెట్టి

"గుండె తాతా మంటు కొట్టినట్టుగ నేటి
పండితులు తారెత్తి పరుగుచ్చుకోవాలి"

అని అనడానికి సందేహించడు. తన మనసులోనిదంతా ఆప్పుడితో చెపుతున్నాడు గదా ! అతనికి లోకమంతా ఆప్తమిత్రమే కదా!

అలాగే ఏ గీతం తీసుకున్నానూ – వేడిగా అనెయ్యడమూ, సూటిగా అనెయ్యడమూ, ఏమీ దాచకుండా అనెయ్యడమూను! ప్రేమగీతాలు, భక్తి కీర్తనలూ, కన్నబిడ్డలపై పాటలు – అన్నీ అంతే.

"మంచి రోజు కాదోయి చందమామా!
మంచిదారి కాదోయి చందమామా!"
"పాడదలచిన పాటలన్నీ నానోట
పాడించ మనసాయెనయ్యా!"
"మండిపోతున్న వండోయ్, లోకాలు
మంటలార్పెయ్యంగ రండోయ్"
"ఎంతటి మందమతినైతి"
"కోయిలా కోయిలా కూయబోకే!
గుండెలూ బ్రద్దలూ చేయబోకే!"
"లోకాని కుత్తుత్త దీపావళీ!"
నాకుమాత్రము దివ్యదీపావళీ!"
"లేపనైనా లేపలేదే, మోము
చూపనైనా చూపలేదే!"

ఈ గుణం వల్లనే, ఈ ఆప్యాయతవల్లనే, ఇతని గీతాలు సామాన్య ప్రజకు కూడ అంత చనవై పోయాయి; దినదిన జీవితానకు, చలనచిత్ర లోకానకు అంత అవసరమై పోయాయి.

బసవరాజు మొట్టమొదటి భావకవి; అంటే భావకవిత్వానికి త్రోవచూపిన వాడనే కాదు; తరువాత వచ్చిన భావ కావ్య జగత్తుకు ప్రవేశిక వంటివాడు –"ముందు ఇతని గీతాని శ్రేణి ఎక్కు. తరవాత భావకావ్య లోకంలో పరిచితంగా విహరించవచ్చు" నన్నట్టు.

అయితే, అంత తొందరలో, అంత వేడిమిలో చీల్చుకు వచ్చిన పాటను, అంత నగ్నంగానూ, అలాగే, సరిగ్గా అలాగే, ఇవతలికి విసరివేసినప్పుడు కల్పనకు అవకాశముండదు; శిల్పానికి స్తిమితముండదు.

అనుభూతిని నిదానంగా నెమరువేసుకుని – **Recollection in Tranquillity** లోలాగ – అతను కావ్యం కట్టడు. అనుభూతి రావడమూ అనెయ్యడమూ ఒక్కమాటే జరుగుతాయి.

మరొక విశేషం, పాడుతూ వ్రాసేవాడేమో బసవరాజు. అయితే కొంతవరకు అందరూ అలాగే వ్రాస్తారేమో; కాని అతనిపాట అంతర్వాహి ని కాదు; కేవలమూ అడుగున శ్రుతి కాదు. పాటదే పై చెయ్యి. దాని బలం ఎక్కువైపోయేదేమో కూడా. మరి అతనికి కావలసింది. **"Relief which a timely utterance gives"**. అందువల్ల భావనాశిల్పాలు లేని వెలితిని పాట భర్తీ చేసేది. అందుకనే అతని రచనలు కొన్ని కావ్యాల లాగ కూర్చుని చదివేవి కావు; గొంతెత్తి పాడేవి. అందుకనే గూడా పాడేటప్పుడు అతని గీతాలకు ఉన్న శక్తి మరి ఏ కవి గీతాలకూ లేదనిపిస్తుంది.

అందుకనే గూడా అతనెప్పుడోగాని మామూలు శబ్దాలను దాటి వెళ్ళలేదు. ఎవరితోనైనా కష్టసుఖాలు వేగముతో వేదనతో చెప్పుకునేటప్పుడు అపూర్వశబ్దాలకూ అల్లిక జిగిబిగికీ పరుగెత్తుతామా?

అతను రోజురోజూ నిముషనిముషమూ అలాగే చెప్పుకునే వాడాయెను. అతనికి కవిత్వమూ చెప్పుకోవడమూ ఒక్కటే అయెను.

ఈ గుణం వల్లనే అతను గురజాడవారికి అనుచరుడు అయాడు; కొన్నికొన్ని చోట్ల అంతకన్న అధికుడయాడు. గురజాడ వారిలో ఈ ఆప్తత, ఈ ఆర్ద్రత ఇంతగా లేవు. **Words worth** "సామాన్యభాషలో కవిత్వం చెప్పా" అని ఒక మతంగా అవలంబించి చేయాలని చేసిన పని, ఇతనింకొక లాగ చేయలేక చేసి, ఊరుకున్నాడు. ఊరుకున్నాడా! పదిమందీ పరవశులై వినేటట్లు ఆలపించాడు.

దీనివల్ల ఒక్కొక్కప్పుడు **Words worth** లో లాగే పేలవమైన మాటలూ కాళ్ళు చాపేసి చతికిలబడే పంక్తులూ రావచ్చు.. అయినా జీవద్భాషకు, వ్యావహారిక భాషకు, ఇంత దగ్గరగా కావ్య భాషను తీసుకువచ్చే ప్రయత్నం గొప్పపని కాదూ!

కవి విధురజీవితంలో, ఆ మబ్బు ఈ మబ్బు ఆకాశ మధ్యాన అద్దుకున్నప్పుడు, చిట్టితల్లి బంగారపు బొమ్మ మంగళప్రదమ్మ అవతరించింది.

అంతలో ఇతన్ని దేవుడు "కత్తి పెట్టి పొడిచాడు."

'గాయం ఇంకా మానలేదు'.

మంగళప్రద (కవి చిన్నపాప) మాయమయింది "మరవలేదేనిన్ను మా కన్నతల్లి" అని ఏడ్చాడు. "కోయిలొకసారొచ్చి కూసిపోయింది" అని పలవించాడు.

ఇంతలో దీపావళి వచ్చింది.

మనకందరికీ లాగ ఉత్తుత్త దీపావళికాదు. దివ్య దీపావళి! వేద్రాది నరసింహదేవు డతనియింట దీపమైనాడు. పరమాత్ముడు వేంచేసి పటమటలంకలో ఉయ్యాలతొట్టిలో ఊగుతున్నాడు.

కవి అమాయకుడూ, ఆశాజీవినీ. పాపాయి రాకతో, మళ్ళీ బ్రతుకు నందనమై పోయింది.

ఇంతలో:

"వేదాద్రి శిఖరాన వెలిగిన్న జ్యోతి
మినుకుమని కాసేపు కునికిపోయింది;
దేవలోకమునుంచి దిగినట్టి గంగ
వచ్చిన్న దారినే పట్టి మళ్ళింది;
పంజరం దూరిన బంగారు పిట్ట
తలుపుతీసే వేపా తరలిపోయింది;
కాపుర మ్మొచ్చిన కన్నె పాపాయి
ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు!"

ఈ గీతం మా బసవరాజు పాటలన్నింటికీ కిరీటం తుది పంక్తి ఈ పాటకు తురాయి.

"ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు"

ఎటువంటి మామూలు మాటలు! నిజానికి ఎంత పేలవమైన మాటలు!

ఇక్కడ మాత్రం మాటమనిషై ఎలాగ గుండెల్లో పొడిచింది ! రోజూ ఎన్ని ఇళ్ళో ఎందరో ఖాళీచేసి వెళ్ళి పోతున్నారు; మరికొందరు ఆ యిళ్ళలోకి వస్తున్నారు. ఖాళీ చేసినా ఖాళీగాని ఇళ్లు అవి.

ఈ యిల్లువేరు. ఈ యిల్లు కిటికీ తలుపూ లేని అమాయకపు ఇల్లు. ఈ యిల్లు ఒక్కొక్కరే ఖాళీ చేసి వెళ్ళిపోయేదే గాని తిరిగి రానియిల్లు. కొన్ని యిళ్ళు బారుమని ఏడుస్తాయి; ఫరవాలేదు. అబ్బ! ఈ యిల్లు శూన్యం; దీన్ని పాపాయి ఖాళీచేశాడు గనక.

ప్రపంచ కావ్య భాండారంలో గొప్ప పంక్తుల్లో ఇదొకటి- ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు!

అప్పారావు కవిత్వం వల్ల ఏమిప్రయోజనం అంటే, ఏమి చెప్పను? అతని కావ్యాలన్నీ చదివాక నిట్టూర్పు విడువకుండా, కన్నీటితో చెక్కులు తడియకుండా ఉండలేము.

ఆ కన్నీటి కెంతటి శక్తి ఉంది? ధూళీ దూగరా లేకుండా, శుభ్రంగా, శాంతంగా, సుందరంగా, వాన వెలిసిన తరువాత చెట్టులాగ, చల్లని ఆవేశంతో, రవంత ఊగుతూ, నిలబడతాము!

అప్పారావుకు సంస్కృత సాహిత్యమన్నా, పురాణ భారత సంస్కారమన్నా, వల్లమాలిన గౌరవమూ అనురాగమూనూ. ఆంధ్రదేశమన్నా అంతే. వాయుపక్షాల మీద తెలుగునాడంతా తిరిగి సందేశమిచ్చినవాడు. భారతస్వాతంత్ర్యంకోసం పాటుపడిన వాడు. కొల్లాయి కట్టుకున్న బోసినోటి వానికి దాసుడైనవాడు.

అయితే అతని దేశభక్తి సంకుచితమైనది కాదు. అతను యుగలక్షణాలకూ, యుగధర్మాలకూ దూరుడు కాలేదు. రాగల యుగం ప్రజాబాహుళ్యానిదని తెలుసుకున్నాడు. ప్రాచ్యపాశ్చాత్యజగత్తులకు నడుమ కొండలూ గోడలూ లేవని తెలుసుకున్నాడు. ఆంధ్ర కవిత్వ చరిత్రలో అతను వ్రాసిన తుది పంక్తులివి-

"ప్రస్తుత మాంధ్ర సాహితీ శ్రేయోభిలాషులకు ముఖ్య కర్తవ్యమేమన; తరతరములనుండియు, శతశతాబ్దుల నుండియు నిరంతరధారగా ప్రవహించుచున్న ఆంధ్ర నాగరకతా స్రవంతిని ఆంధ్ర సాహిత్య సీమను ప్రవహింపజేసి తత్ప్రవాహ సాహాయ్యమున ఆంధ్ర సాహిత్య సీమను చక్కని వ్యవసాయము సాగించి, ఆంధ్రులకు పుష్టియు, తుష్టియు, శాంతియు, దాంతియు, వన్నెయు, వాసియు నిచ్చు కావ్యఫలముల కాయించుటయె యగును. ఆంధ్ర సాహిత్య సీమను నాటుకుని, పెరిగి పెద్దది కాగల విజాతీయ కావ్య తరులతాదులనాటించి, వానిచే సజాతీయ, విజాతీయ సారసమృద్ధములగు కావ్య ఫలముల కాయించుటయును మెలగును. ఇందులకు అన్యభాషా సంస్కారమును,

అన్యసాహిత్య పరిచయమును అవసరములై యగును".

అప్పారావుది సమగ్రసుందరమైన గొప్ప సంస్కృతి, దువ్వూరి రామిరెడ్డి గూడ ఇట్టివాడే.

1929లోనో, 30లోనో నేను మదరాసునుండి పిఠాపురం వస్తున్నాను. పేసింజరు తెల్లవారగట్ల కొవ్వూరు దాటి గోదావరి మీద పోతుంది. నాకు మెలకువకాదు, నిద్దుర కాదు. వంతెనమీద నడిచే ట్రెయిను హెూరెలో కలిసి ప్రక్క కంపార్టుమెంటులోనుంచి ఒక పాట వినబడంది.

"ఈ మహాగహనాంతర సీమలోన
నీవు శ్రీగిరి భ్రమరాంబ నేను మల్లి కార్జునుడ"

ఆ పాట పాడినవారు ఎవరు ? మా బసవరాజా?

గోదావరి స్టేషనులో దిగి ప్రక్క కంపార్టుమెంటులో తిలకించగా అతనూ అతని అర్ధాంగి రాజ్యలక్ష్మమ్మా – కవయిత్రి సౌదామనీ దేవి – కూర్చున్నారు.

"ఎక్కడికి వెడుతున్నా"రన్నాను. "ఉత్తర దేశ యాత్రకు" అన్నాడు.

అతని దెప్పుడూ మజిలీ లేని యాత్రే అయెను. అతని తత్వాన్ని బట్టి అతన్ని 'Gypsy' అనేవాళ్లం.

ఒక పాట పాడమన్నాను.

"బ్రతుకు బరువు మోయలేక,
చితికి చివికి డస్సి వాడి,
పెకరుపుట్టి పారిపోయి,
ఒకడనె ఏ తోటలోనో,
పాటపాడుతుండగ నా ప్రాణి దాటి యేగేనా!
ప్రాణిదాటి యేగుచుండ పాటనోట మ్రోగేనా!"

తరువాత మరి అతన్ని చూడలేదు.

పాటపాడుతూ పోయాడు మా బసవరాజు. పోతూ పాటపాడాడు.

రాగద్వేషాలుదాటి శ్రీశైల మల్లికార్జునస్వామి చరణ సవిధాన చివరకు మజిలీ దొరికింది. తానూ మంగళ ప్రదమ్మా పాపాయి ఉన్నారు అక్కడ.

ఇక్కడ అతని ప్రాణానికి ప్రాణమైన రాజ్యలక్ష్మమ్మ, ప్రాణమిత్రులమైన నండూరీ నేనూ ఉన్నాము.

# అన్నమాచారి

ఈ అన్నమాచార్యోత్సవాన్ని ప్రారంభించడానికి నన్నెందుకు రమ్మన్నారోగాని! విద్వాంసుణ్ణిగాను, గాయకుణ్ణిగాను, భక్తుణ్ణిగాను, అమాత్య పదవి వంటి పదవిలో ఉన్న వాణ్ణి గాను. పిలుపు రాగానే ముఖానికి చెయ్యి అడ్డుపెట్టుకుని నాలో నేను నవ్వుకున్నాను. అయినా ఒప్పుకున్నాను, దేవస్థానం నుండి వచ్చేది ఆహ్వానం కాదు ఆనతి కనుక; రెండోది, దేవస్థాన ధర్మకర్తృ సంఘాధ్యక్షులు శ్రీ చంద్రమౌళిగారు నాకు మిత్రులూ మాన్యులూ కనుక; మూడు, స్వామి దర్శన భాగ్యం మరొక్కసారి కలుగుతుంది కనుక; నాలుగు, అనేక ఆపత్తులలో అఘాతాలలో నలిగి గాయపడ్డ హృదయానికి కాస్త ఉపశాంతి కలుగుతుందని ఆశ ఉంది గనుక:

నేనీ మధ్య పదేపదే అనుకుంటుంటాను, "అయ్యో! భగవంతుని ఆస్థానంలో కవిగా ఉండిపోయి, ఎంత నిర్గంధాలయినా నా గేయకుసుమాలతో ప్రభువును అహరహమూ అర్చించుకోలేనంత అల్పుణ్ణీ బలహీనుణ్ణీ అయిపోయాను గదా" అని.

అసలైన కవులూ, గాయకులూ, భగవంతుని ఆస్థానం లోనే కవులూ గాయకులూగా ఉండాలి. కాళిదాసు పరమ శివాస్థాన కవి;

త్యాగరాజు రామచంద్ర ప్రభువు ఆస్థాన గాయకుడు.

నేనొక కథ విన్నాను, తాన్సేనును గురించి. నిజమైతే మహా గొప్ప కథ. మొఘల్ పాదుషా అక్బర్ కొలువులో గాయకుడూ అతనికి ప్రియతముడున్నూ. తాన్సేన్. చక్రవర్తి ఎప్పుడూ అంటుండేవాడట, "తాన్సేన్! నీలాగ పాడేవాడు మరెవడూ లేడేం?" అని.

కామినీ కాంచనాలకన్న కూడా కీర్తి మనిషికి ప్రియమైనది. అందులో రసజ్ఞ శేఖరుడైన సార్వభౌముని'పొగడ్త కన్న రుచికరమైన దేముంటుంది? చక్రవర్తి పొగిడితే యావత్ సామ్రాజ్యమూ పొగుడుతుంది

అయినా నిజమైన విద్యావంతుడికి వినయం ఉండి తీరాలి కదా!

ఒకనాడు తాన్సేన్ అన్నాడు, "జహాపనా! నన్ను మన్నిస్తే, తమరు నా శిష్యుడుగా తయారయి, నా తంబూరా చేత పట్టుకుని, నాతో కూడా పాదాచారులై ఒకచోటికి రాగలరా" అని పాదుషా "సరే" అన్నాడు. సాయంకాలం రాత్రిగా కరిగి పోతూంది. యమున జపం చేస్తున్నట్టు తరంగ కంఠానికి గడియ వేసుకుని మౌనంగా ఉంది. గాయకుడు ముందూ, తంబూరా పట్టుకుని చక్రవర్తి ఆ వెనకా, నడుస్తూ, యమునకు ఆవలి ఒడ్డున ఉన్న హరదాస స్వామి ఆశ్రమానికి వెళ్ళారు. స్వామి తాన్సేనును పాడమన్నారు. తాన్సేన్ ఏదో రాగమెత్తి పాడాడు. అంతలో స్వామి తానందుకుని పాడారు. రాత్రి మరి కాస్త సాగాక తాన్సేనూ అక్బరూ సెలవు పుచ్చుకుని ఆశ్రమం వదలి వచ్చేస్తున్నారు. తోవలో రాజు గాయకుణ్ణి అడిగాడూ, "తాన్సేన్, నువ్వు హరదాస స్వామిలాగ పాడలేవెందుచేత?" అని. ఆస్థాన గాయకుడన్నాడూ, "జహాపనా, నేను ఏలినవారి సెలవైనప్పుడు పాడతాను. స్వామి భగవంతుని ఆదేశమైనప్పుడే పాడతారు," అని. అందుకనే గాయకుని గురించి వ్రాస్తూ ఆంగ్లకవి అంటాడు – **God has a few of us, whom he whispers in the ear"** అని, అయితే త్యాగరాజువంటి

అలౌకిక ప్రతిభావంతుణ్ణి ఏ ఒకణ్ణో ఎన్నుకుని భగవంతుడు చెవిలో దివ్య రహస్యాలను ఊదుతాడేమో!

ఇక, రెండో రకం వారున్నారు. వీరూ ప్రతిభావంతులే. వీరు లోకరంగంలో పూర్తిగా కాలూది నిలిచి, జీవితంలో విధవిధాల అనుభవాన్ని గడించి, సంసారయాత్ర సామాన్యుని లాగే సాగిస్తూ, సాధువులూ సత్పురుషులూ అయి, భగవంతుణ్ణి కొలుచుకునేవారు. వీళ్ల కొక దీక్షా, ఏకాగ్రతా, నిరంతర వ్యవసాయమూ, అలాంటి సుగుణాలూ కూడా ప్రజ్ఞతో పాటు ఉంటాయి. వీరూ తక్కువవారు కారు; అన్నమాచార్యుల వంటివారు. త్యాగరాజు నా దృష్టికి లోకంలో కాళ్ళూది నిలబడ్డవాడు కాడు; ఒక అతిలోక వాతావరణంలో, ఒక ఆవేశ అధిక్యత మీద, వింతయైన ఒక ఆనంద చంద్రాతపంలో తేలుతూ ఉంటాడాయన. ఆయన కృతులు ఆత్మాశ్రయములు (subjective). అన్నమాచార్యుల వారు లోకజ్ఞులు. అయినా ప్రతి పదమూ సర్వమూ భక్తి శ్రద్ధలతో వేంకటేశ్వరార్పితం గావించుకునేవారు. ఐహిక జీవితంలోని అనేక అనుభవాలనూ రుచులనూ తెలుసుకున్నవారుగా ఉంటూ, మాలిన్యం అట్టే అంటించుకోక, వాటిని వేంకటేశ్వరాంకితములుగా ఉదాత్తపరిచేవారు. అందువల్లనే శ్రీ అనంతకృష్ణ శర్మగా రన్నట్లు తాళ్ళపాక వారి రచనలు అర్థభావ ప్రధానము లయాయి. త్యాగరాజ కృతులు నాద రచనా ప్రధానము లయాయి.

సంగీత విద్యలో సుతరామూ ప్రవేశంలేని నేను నాకు తోచిన అభిప్రాయాలు నా ధోరణిలో ఇక్కడ చెప్పుకుంటే నన్ను మన్నించండి. మన అప్పకవి చెప్పినట్లు ఒక దృష్టితో చూస్తే, "విద్యలకు నెల్ల ఉత్తమ విద్య కవిత" కాని మరో రీతిగా చూస్తే సంగీతం కంటె గొప్ప విద్యలేదు. మాట మనిషి వంటిది, పాట పక్షి వంటిది. మాట నడుస్తుంది, పిలుస్తుంది, పలుకుతుంది. గానం **Shelley's Skylark** లాగ అంతరిక్షాల్లోకి వెళ్లిపోతుంది. ఆ ఆంగ్లకవి విహంగం ఎగురుతూ పాడుతుంది. పాడుతూ

ఎగురుతుంది. గానం అన్ని కళలకన్నా సద్యః ఆనందం కలిగించడమే కాక, అది అందుకోలేని ఎత్తులు లేవు; చొచ్చుకు పోలేని లోతులు లేవు. మాటల కందని అనుతులు వచ్చినప్పుడు, వాటిని వ్యక్తపరుస్తుంటేనే గాని మనం బతకలేనప్పుడు, పాటే మనకి ఏక శరణ్యం. అందుకనే ఎట్టి చేతకాని మానవుడైనా, గాఢతరమైన అనుభవం పొందినప్పుడు, 'రిలీఫ్' కోసం సంగీతాన్నో సంగీతభాసాన్నో ఊతగా తీసుకుంటాడు. అందుకోసమే నేనంటానూ, గేయానికి ఎక్కువగా శబ్దార్థ అలంకారాలు తొడగకూడదని. అంత శిల్పభారం మోసుకుని గాన విహంగం పక్షాలు బాగా ఎగరలేవు. అందుకనే లోకదుర్లభాలైన శ్రీ చరణాలనే పట్టుకుని శ్రీ సన్నిధినే నిలవగోరే త్యాగరాజప్రభువు కీర్తన ఎక్కువ నగ్న సుందరంగా ఉంటుంది, "My song has put off her adornments" అని రవీంద్రుడన్నట్లు ! మన అన్నమాచార్యుల రచనలో శిల్పసౌందర్యమూ అలంకార భారమూ గడసరితనమూ లేకపోలేదు. అన్నమాచార్యులది రాళ్లపల్లివారన్నట్లు కేవలమూ నాదరచన కాదు. కాని కవులకూ సాహిత్య ప్రియులకూ ఈయన పదాలు ఎక్కువ యిష్టంగా ఆప్తంగా ఉంటాయి – అర్థభావ సంపదవల్లనూ, మాటల కూర్పులో పొందికవల్లనూ!

నేను మొదట ఈతని పదాలు అనంతకృష్ణ శర్మగారు పాడుతుంటేనూ, నా అల్లుడు రజని పాడుతుంటేనూ విన్నాను, "అలరులు కురియగ ఆడినదే" అన్నదీ, "కులుకక నడవరో కొమ్మలారా" అన్నదీని. దరిమిలాను ఇలాటివి మరెన్నో విన్నాను. ఇక పెద తిరుమలయ్యగారివి కాబోలు వచనాలు రజని పఠిస్తూంటే విన్నాను. అంతకు మునుపు కన్నడంలో బసవేశ్వరునివేమో వచనాలు ఆకాశవాణి ప్రసారం చేస్తే ఆలకించినట్లు జ్ఞాపకం.

తాళ్ళపాక వారి వచనాలకు రాగతాళాలు లగించి ఉన్నాయి. ఎలా చెప్మా వీటిని పాడతారూ అనుకున్నాను. నాదస్వర విద్వాంసులు

ఆలాపన చేస్తూ, మధ్యమధ్య పక్కని డోలువాడు చూపే లయలోకి వస్తూ పోతున్నట్లు, సన్నాయి వాయించడం విన్నాను. అలాగు పాడాలేమో వీటినన్నీ! మొదటి వచనం చదువుతుంటే, (Tagore) గీతాంజలిలోని–

*Life of my life,*
*I shall ever try to keep my body pure,*
*Knowing that thy living Touch is upon all*
*My limbs -*

అన్న మహాకృతి జ్ఞాపకంవస్తుంది.

"శ్రీ వేంకటగిరి దేవా నాదేహంబు నీవుండెడి నిత్య నివాసం అన్నది" మరొక వచనంలో తాళ్ళపాక కవి ఎట్టి సూక్ష్మబుద్ధో లోకజ్ఞుడో గడసరో, అయినా ఎట్టి వినయ ప్రపత్తులు కలవాడో తెలుస్తుంది.

"దానవారీ, తొల్లినే నుత్తమ ధర్మంబు నెరుంగుదునా?" ఎంత ఒడుపుగా రచించాడండీ యీ వచనం?

అందుకనే అంటాం. కవికిగాని గేయకర్తకుగాని ప్రజ్ఞ పుట్టుకతోనే రావాలి అని ! నాకు అన్నమాచార్యుల్ని గూర్చిన రెండు కథలు ఇష్టం.

ఆయన పశువుల్ని కాసుకుంటూ, అన్నదమ్ములు బెత్తాయించిన మోటుపనులు చేస్తూ, పొలంలో గడపడం యిష్టంలేక, ఒకనాడు ఏడుకొండలూ ఎక్కి వేంకటేశ్వర స్వామి సన్నిధి చేరడమేమిటి, హఠాత్తుగా ఒక పదం పుట్టుకొచ్చిందట! అంతే, పదకవితా పితామహుడై ఊరుకున్నాడు. "మీరు పదమో పద్యమో ఎలా కడతారండీ? మీకెలా వస్తుందండీ గేయం?" అని అడుగుతుంటారు. అంటే ఏమిటి? ఎలా చెప్పగలుగుతారు? రకరకాలుగా వస్తుంది. అదృష్టాన్ని బట్టి వస్తుంది. కనబడని చెయ్యి ఏదో గళద్వారపు గడియ తీస్తే వస్తుంది. ఒక్కొక్కపాట అనుకోని అతిథిలాగ తలుపు తెరుచుకొని ఎదుట

నిలబడుతుంది. మరొక్కొక్కపాట పుట్టలో నుంచి పాములాగ కొంత కొంతగా పాకివస్తుంది. ఒక్కొక్క పాట నిన్న రాత్రి మోడులాగే కనపడే పొదమీద తెల్లవారగానే నిండుగా వికసించిన కన్నెపువ్వులాగా గాలిలో తలూపుతూ ఉంటుంది, ఒక్కొక్కపాట మట్టి బొమ్మలాగ. కర్రయంత్రంలాగ, ఒక కాలూ, ఒక చేయీ, ఒక చక్రం, ఒక మరా అతికించుకుంటూ స్తబ్దుగా తయారవుతుంది. చెప్ప లేం. ఒక్కొక్కసారి గేయం అంతా తయారై, దానిలో ఒకమాట ఏ నెల్లాళ్లకో వచ్చి, సమగ్ర మోహన రూపం ధరిస్తుంది. అన్నమాచార్యుల మొదటిపాటెలా వచ్చిందో గాని !

ఆయన రెండో గాథ. ఆయన గౌరవం, దర్జా గూర్చి. సాళువ నరసింగరాయని మీద పాటలు కట్టనన్న గొప్పతనం, దానికి సంబంధించినది. ఆయన ఒక్క సరస్వతి శ్రీనివాస ప్రభువకే అంకితం. అన్నమాచార్యులవంటి కవులెందరున్నారు? ఎక్కడున్నా రిప్పుడు?

తాళ్లపాకవారి రచనలను గూర్చి నాకు స్ఫురించింది మరో విషయం ఉంది. అది వారి రచనల్లో కనపడే విషయ వైవిధ్యం, నిత్యనూతనత. ఈ గుణాలుండడానికి కారణం ఇదీ అని తోస్తుంది నాకు – ఎక్కడ చదివినానో జ్ఞాపకం లేదు. ఒక కవిని గూర్చి వ్రాస్తూ ఒక సాహిత్య రహస్యవేత్త వ్రాసిన మాటలు. మనుష్యుల్లోలాగే మాటల్లోకూడా ఎప్పుడూ ఒకే ఒక ఉదాత్త తరగతికి చెందిన వాటినుండే, **Patrician class** నుండే సంబంధ బాంధవ్యాలు కల్పించడం వల్ల, సుకుమారంగా ఉన్నప్పటికీ నీరసంగా ఉండే బొమ్మల్లాంటి అల్ప సంతానం పుట్టుకు వస్తుందనీ, కనుక **Hardy plebeain blood**, అంటే పటిష్ఠమైన సామాన్యుల జీవరక్తం వాటిలోకి చొప్పించాలనీ వ్రాసేడు. అంటే సామాన్యులు, 'మంది', మాట్లాడే జీవద్భాషను కూడా మన కావ్య భాషలోనికి చొప్పించాలి అని. అలాగే ఇతర విద్యల్లోనూ, సంగీతంలోనూ:

తాళపాకవారు సామాన్యుల భాషనుండి శబ్దాలూ పలుకుబళ్ళూ తీసుకున్నారు. సామాన్యులు పాడే గేయాలనుండి-ఏల, జాజర, చందమామపదం, తుమ్మెద పదం వంటి వాటినుండి తమ-పదరూపాలను ఏర్పరచుకున్నారు. కనుక వారి రచనల్లో ఒక నిత్యనవ్యత జీవం, నాటకీయత, రంగూ, రుచీ, ఒక అవ్యక్త మాధుర్యమూ, అన్నీ సమకూడాయి.

చివర్న నాలుగు మాటలు మాత్రం అకలంకమైన మనస్సుతో చెప్పుకుంటున్నాను. **Blake** అనే ఆంగ్లకవి చనిపోయేముందు పాటలు కట్టి గట్టిగా గొంతెత్తి పాడుతూ, "నాకు రెండు రెక్కలున్నాయి సంగీత కవిత్వాలు వీటిమీద హాయిగా పైకి వెళ్లిపోతున్నాను." అని అంటాడట! అన్నమాచార్యులు అలా అనుంటాడు. ఆయన రోజుల్లో శ్రీనివాస ప్రభువు దర్శనానికి ఇందరు యాత్రికులు వచ్చి ఉండేవారు కాదేమో. ఏడు కొండల ఒడల్లమీద ఇట్టి దీపాల నగలు అప్పుడు లేవేమో. కొన్ని మెట్లెక్కడం, ఒక చిన్న లోయలోనికి దిగడం, ఒక అధిత్యక అధిరోహించడం, ఆవంత విశ్రాంతి తీసుకోవడం. ఇక్కడ ముళ్లపొదలు ఒత్తిగించుకోవడం. అక్కడ రాళ్ల కరకు మొనలపై కాలూనడం. అంతలో ఒక మలుపూ, ఇంతలో ఒక తిరుగుడూ, ఒక కొండ అడ్డురావడం, దానిపై నుండే దూరాన దివ్యమందిర స్వర్ణ శిఖర సుదర్శన దర్శనం లభిస్తూండడం, మళ్లీ బలం ఉత్సాహం కలగడం. మళ్లీ కొండెక్కడం – ఆ రోజుల్లో తిరుపతి యాత్రకి జీవితానికి ఉన్నంత అర్థం ఉండేది. ఇప్పుడు లేదనను. ఇప్పటి యాత్రిక కోటిలో విశ్వాసంతో పాటు మానవుని అసహాయత కనబడుతుంది. అప్పటి యాత్రిక కోటిలో విశ్వాసంతో పాటు గాఢ శ్రద్ధా, అకుంఠిత దీక్షా, పరమపదం చేరుకొని తీరుతాను అనే సంకల్పం గోచరించేవేమో. పరమపదానికి అడ్డదారులు వాహన సౌకర్యాలు లేవు. ఏ గుడ్డిదో, కుంటిదో విశ్వాసమే మేలు అవిశ్వాసం కన్న. నేటి అవిశ్వాసికి తీర్చిన మార్గంలేదు, చేరుకొనే గమ్యస్థానం లేదు.

నాకు ఈ తిరుమలకు మరోవిధాన రావాలని ఉంది. ఈసారి వచ్చినప్పుడు ఆ సమయాన కృష్ణరజని అంచులలో బంగారు రేఖలు పాకుతూండాలి స్వామి పుష్కరిణి నుండి నీటి చలువలతో పద్మగంధాలు మోసుకు వచ్చే వేకువ గాలులు నా నుదురు నిమురాలి. నేను ఏడుకొండలూ మెల్లెక్కి సాగాలి. స్వామి కొలువులో ఒక మూల ఒదిగి నిలబడాలి. తీరా ప్రభువు వీక్షణం నా మీద రవంత నిలిచాక నాకు బిడియమూ భయమూ రాకుండా ఉండాలి. 'నీవు నా కోసం ఏమి తెచ్చావు, అని నా ప్రభువు నా వైపు చేయిచాపాలి. రంగు రంగుల ధూళితో శబలితమైన నాజోలెలోని బరువులు ఆయన పాదాలముందు కుమ్మరించబోవాలి. అలాగ కుమ్మరించడమేమిటి.

కదలు నెవో మరల నాయెదలో ఒత్తిలి గీతులు
నిదురించే పులుగు గూట విదిచే రెక్కల వోలె!

అప్పుడు ప్రభువు అనుజ్ఞనివ్వాలి. నాకు గొంతు పూర్తిగా రావాలి. నా స్వామిపై ఒక్క ప్రభాత మంగళగీతం పాడాలి. అందాకా ఏదీరజనీ, "కృష్ణ రజని" నుండి ఆ గేయం –

"నీ యింటికి పిలువకు, నను లోనికి రమ్మనకు,
రేయని, నీ వీథిని బడిపోయే యేకాకినని!
దారివెంట కలలేవో సారెసారె ఏరుకుంటు
ఏరెరుగని పాట ఏకతారపైని మీటుకొంటు
పోయేవానిని నేనిని, నీ యింటికి పిలువకు!
తలుపు తీసి పిలిచినటులు తల ఊపకు.
అలవి కాని మమతలు నా యెడ చూపకు, నన్నాపకు,
నిలువ లేను, కృష్ణరజని తెలవారగనే, స్వామి
కొలువున, మంగళవిభాత కలగీతిక పాడవలయు".